# మరువలేను

## మూడవ భాగము.

కర్త:—శ్రీ జంపన చంద్రశేఖరరావుగారు
బి. ఏ. (ఆనర్సు), బి. ఇ. డి.
అన్నామలై యూనివర్సిటీ, చిదంబరం.



యస్. అప్పలస్వామి అండ్ సన్స్,
పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్,
రాజమండ్రి.
1944

 [వెల 0—8—0

## ఉద్దేశం:—

"ప్రేమ జగదేకి దేవత—

ప్రత్యణువు దానిబానిస"

అన్నామా 'రాంబాబు' మాట 'మరువలేను'. మనసారా—తనివి తీరా—కరువుదీరా—ప్రేమించుకొన్న ప్రియులను ఏనాడైతే స్వార్థపరులు వేరు చేస్తారో—ఆనాడే వాలి కర్మదేవత, వారిజీవితాలకు నీరాజనం ఇచ్చివేస్తుంది. తప్పదు...అటువంటి ప్రియులను వేరుచేసి వారిజీవితాలను విషాదాంతం చేయకుండా, మానవ హృదయ పరివర్తనం తెలుసుకొని, వారి ప్రేమను వైవాహికంచే పవిత్రించేయుట భారతీయుని కర్తవ్యం...అదే దేశ సౌభాగ్యసౌందర్యానికి తొలిమెట్టు...

ఈ విషయం ఈ నవలలో చెప్పించటమే నా ఉద్దేశం—ఇది 'మేనకోడలు' తరువాతభాగం సుమండీ...శలవు...

చంద్రం.

అంకితం—

ఇదికూడా మాడాక్టరుగారు

కాన్నమూరి చిరంజీవిస్వామిగారికే

ప్రేమతో అర్పిస్తున్నాను.

చంద్రం.

౧

"బావా!"

"సుందరీ!"

"అత్తమ్మ మనకు దక్కినట్లే...ఆమె ప్రాణానికేమీ భయం లేదు. నీవుపోయి డాక్టరు చిరంజీవిగారిని తీసుకురాకూడదు?"

"అలాగే...అమ్మ మళ్ళీ మూసుకుందే?"

"దెబ్బ ఎక్కువగా తగిలింది. రక్తం కారిపోయింది...నీరసం యెక్కువయింది. అందుచేత మధ్యమధ్య స్మృతి తప్పుతూఉంది."

"డాక్టరుగారికోసం ఎవరినైనా బందరుపంపుతే..."

"లేదు...నీవే వెళ్ళు...కారులో పదినిమిషాల్లో రావచ్చును."

"సరే."

"వెళ్ళు బావా! లే! ఆలశ్యానికిది తరుణంకాదు."

"సుందరీ! అమ్మ ఒక్కసారి కళ్ళు తెరవనియి...కళ్ళు తెరచిన ఆమె ముఖంచూస్తే హృదయానికి కొంతశక్తి వస్తుంది ... అంతవరకు కాస్తదూరం నడవటానికైనా, నా కాళ్ళల్లో శక్తిలేదు...మాట్లాడటానికికూడా నా గొంతుకులో శక్తిలేదు."

"ఇలాగంటే—ఎలాబావా! మగవాడవు నీవే ఆపదలో అధైర్యంపడితే ఎలాగు? కష్టాలువచ్చినప్పుడే, గుండె రాయిచేసుకొని కార్యాలు చేయాలి."

"అవును...అన్నీ తెలుసు ... ప్రయోజనం ఏముంది? ప్రవిషయంలో అవి పనికిరాలేదు..."

బావా మరదళ్ళు ఆమె శరీరం చూస్తారు...

క్రిమేపీ ప్రభావతి శరీరం చల్లబడిపోతూఉంది.

"బా...వా!"

"సుందరీ...వళ్ళు చల్లబడిపోతుందే?"

"అందుకనే వెళ్ళు—బావా...వెళ్ళు...నీవు వెళ్ళపోతే నేనే వెళతాను."

"అయితే జాగ్రత్త..."

అతడు తల్లివంకేచూస్తూ గుమ్మందాటబోయాడు. తల్లి రక్తం బొట్లు కారినస్థలం జ్ఞాపకంవచ్చింది...చూచాడు. అతని కాళ్ళునరాలన్నీ తోడుకుపోయాయి...

ఖంగారుపడుతూ నాలుగుమూలలా చూస్తున్నాడు.

కారంతలో వాళ్ళగుమ్మంముం దాగింది.

చిరంజీవి స్వామి డాక్టర్‌గారు కారులోంచి ఆత్రుతగాదిగారు. వినయకుమార్ ఆశ్చర్యపోయాడు...

వెదకబోయే తీవ కాళ్ళకు తగిలినట్లయింది.

"డాక్టర్‌గారూ..."

"ఏం వినయా...మొదట లోపలికిపద పద."

"మీ కెలా తెలిసింది? ఎవరు తీసుకువచ్చారు?"

"మీరు పంపారుకదూ!"

"ఎవర్ని?"

డాక్టరుగారి మందుల (Bag) బేగ్ తీసుకొని గోవింద్ తయారయ్యాడు. అతనికేసి డాక్టరుగారు కన్ను చూపించాడు.

వినయకుమార్‌కు గోవింద్ అనాహుతమైన సేవకు—న్నీ కానికి— మనసులో ఎంతోపొంగిపోయాడు...

డాక్టరుగారు లోపలికివెళ్ళారు.

"గోవింద్...అబ్బా! నీకు మా కుటుంబంఅంటే ఎంతప్రేమ!"

"దానికేమిల్లే వినయా! ముందట అమ్మగారి కెలాగుందో చూద్దాంపద" వారిద్దరూ లోపలికివెళ్ళారు...

డాక్టర్ని చూచిన సుందరి ఆశ్చర్యపోయింది...

"మా బావ ఎలావెళ్ళారు...మిమ్మల్ని..."

"గోవింద్ తీసుకువచ్చాడుగాని..."

డాక్టరుగారు ఆమెతల చూచాడు. దెబ్బ చిన్నదే. వెంటనే సంచిలోనుంచి లోషన్ తీపి కడిగి—కట్టుకట్టాడు...

"డాక్టరుగారూ! మా అమ్మ కెలాగుంది?"

"డాక్టరుగారూ! మా అత్తమ్మకేమీ ప్రమాదంలేదుకదా!"

"లేదు...ఏమీ ప్రమాదంలేదు...వేడికి ఒక ఇంజక్షన్ ఇస్తాను. దానితో ఆమె లేచి కూర్చుంటుంది."

"ఏదో తమరిదయ."

"... ... ..."

డాక్టరుగారు ఇంజక్షను ఇచ్చారు.

పదినిమషాలు గడిచాయి.

ఆమె కళ్ళువిప్పి చూచింది.

బావా మరదళ్ళ ఆనందం వర్ణనాతీతం.

"అమ్మా! ఎలాగుంది?"

"మరేమీ పరవాలేదునాయనా!"

"అత్తమ్మా! బాదెలాగుంది?"

"అంతిదిగాలేదు తల్లీ!"

"వినయా! మీ అమ్మకేమీ భయంలేదు. మళ్ళీ రేపువస్తా."

అంటున్న చిరంజీవి డాక్టరుగారిని చూచింది...

" డాక్టరుగారూ ! మీరెప్పుడు వచ్చారు ? "

" ఇప్పుడేలెండి...మరేమీ ఖంగారులేదు...శెలవు. "

చిరంజీవి డాక్టరుగారు బయటకువెళ్ళి—సిగిరెట్టు ముట్టించి—చిరునవ్వుతో—

" వినయూ ! నీకు ఆనందం కలిగితే ఆపలేం—విచారంకలిగితే పట్టలేం...బలేవాడవోయ్ ! మీ అమ్మకేం భయంలేదుగాని...సాయంకాలం ఇంటికిరా ! "

" తేంక్స్ ! " కారు వెళ్ళిపోయింది.

" గోవింద్ ! నీ మేలు ఎన్నిజన్మలకైనా మరచిపోతేనోయ్ ! "

" దానికేమిటి వినయూ ? ఒక్కఊరిలో ఉన్నవాళ్ళం, ఆ మాత్రం ఒకరికొకరు సాయంచేసుకోపోతే ఎలా ? "

" ... ... ... "

" నేను వెళ్ళివస్తా "

గోవింద్ తనకర్తవ్యం తాను నెరవేర్చాడని ఆనందంతో ఇంటికి వెళ్ళిపోయాడు...

వారిద్దరినీ సాగనంపి వినయబాబు ఇంట్లోకివెళ్ళి, ప్రభావతి ప్రక్కన కూర్చున్నాడు.

ప్రభావతికి ఒకప్రక్క బావ; మరోకప్రక్క మరదలు; ఒకరి ముఖాలొకరు చూచుకుంటూ కూర్చున్నారు...

" అమ్మయ్య ! ఆపద గడిచిగట్టెక్కాం "

అన్నట్లు వారికన్నులు చెప్పుతున్నాయి. ఇరువురి ముఖముండలాలు వికసించాయి.

వారిరువురిముఖాలు చూచింది.

పూర్వజన్మలో మరచిపోయిన మధురస్వప్నాలన్నీ కళ్ళకు కట్టినట్లయింది.

"సుందరీ ! వినయా ! మీరు వెళ్ళి భోజనం చెయ్యండి...లేక పోతే నాకేమీ బాగుండదు... కాసేపాగి నేను కాఫీతీసుకుంటాను..."

"అమ్మా ! సుందరి తినివస్తుంది...తరువాత నేను వెళతాలే... ఇద్దరం ఒక్కసారే వెళితేఎల్లా ?"

"లేదు...లేదు...మీఇద్దరూ వెళ్ళాలి. మీఇద్దరూకలసి భోజనంచేస్తే నాకనుల పండువగా చూద్దామని ఉంది...ఇద్దర్నీ ఒక్కఊయాలలో ఊపాను; ఒక్కకంచంలో భోజనం తినిపించాను ; ఒక్కమంచం మీద పరుండపెట్టాను ; ఇద్దర్నీ జీవాత్మలక్రింద పెంచుకున్నాను. కాని.. కాని...కర్మదేవత కడగంటిసైగతోనే మీరిద్దరూ ఉత్తర, దక్షిణ ధ్రువాలకు విసరివేయబడ్డారు...సరే...కన్నుమూసి కన్ను తెరచినకాలం తిరిగి సంపాదించలేము.. గడచిపోయిన కాలాన్ని, కాలిక్రింద నొక్కిపెట్టలేము.

"సుందరీ ! ఏదీ వెళ్ళమ్మా ! వెళ్లు !...బావా నీవూకలసి భోజనంచేయండి...నేనిక్కడనుంచే చూచి ఆనందిస్తాను..."

ఆమెమాటకు వారు జవదాటలేపోయారు...లోపలకువెళ్ళి—ముఖాలు సబ్బుతో కడుక్కొని భోజనాలకు కూర్చున్నారు. వంటలక్క వడ్డిస్తూఉంది. ఎంతకాలానికో అలా కూర్చున్నవారిని చూస్తూఉంటే ఆమెకుకూడా బ్రహ్మానందం అయింది...

"సుందరీ ! అలాచిక్కిపోయావే ?"

"బావా ! నీవుమాత్రం చిక్కిపోలేదు..."

"... ... ..."

"బావా! మన హృదయాలనుబట్టి అత్తమ్మనడవదు. అత్తమ్మ హృదయాలనుబట్టి మనం నడవలేం...అందుచేతే ఈనర్థకాలు..."

"దానికేంగాని సుందరీ! ఆనందుడు నిన్నెలా చూస్తున్నాడు."

"కంటికి రెప్పలాగ."

"నీకు ఆనందంగానే ఉందికదా!"

"... ... ..."

"సుందరీ! మమ్మల్ని ఎప్పుడైనా తలుచుకుంటారా మీరు?"

"తలవని రోజులేదు..."

"సంతోషం...అయినా సుందరీ! నీఅభిమానం నాకు తెలీదా? నీఆనందం నాకు తెలీదా? 'కాలం' తన వేయివేల నీలిముసుగులను మడతలువిప్పి లోకంమీద కప్పుతుంది...ఆ నీలిముసుగుల్లోఉన్న మనం ఒకరిహృదయం ఒకరు అర్థం చేసుకోలేం...తుదకు మనహృదయం కూడా మనం అర్థంచేసుకోలేం. దానిలోనేఉంది సృష్టిరహస్యమంతా"

"నిజమేబావా! ఒకరిహృదయం ఒకరు అర్థంచేసుకోలేని మాట నిజమే...అయినా సృష్టిరహస్యాలను, భగవంతుని ఉనికిని (The existence of God), ఎదటి హృదయాలను, తలచుకొన్న కొలదీ, మనసు వికలత పొందుతుంది; హృదయం బరువెక్కిపోతుంది; కన్నులు చెమగిల్లుతాయి; అదే ప్రయోజనం..."

"సుందరీ! నీవు చాలా అనుభవనీయురాల వౌతున్నావే!"

"బావా! విజ్ఞానమణి—అనుభవమనే సానమీద పదును పెడితేనేకదా ప్రకాసించేది?"

"అవునవును...అనుభవంలేని జీవితాలు—ఆదర్శప్రాయమైన కాజీవితాలు లేవు. అజ్ఞానానికి పదునుకత్తి వంటిది అనుభవం".

... ... ...

... ... ...

"బావా! జీవితానికి ఆదియుందు, అంత్యముందు; మిగిలేది సిద్ధాంతమేగాని...ఏవీ రెండులేయని కబుర్లుచెప్పాదూ! చీకటిలోపోయే పాంథునకు వెన్నెలలాగ—నవ్వు మరచిపోయిన నాపెదాలకు అమృత సేచనంగా ఉంటుంది..."

"సుందరీ! నామాటలంటే నీకెంత ఆనందం"

"నామాటలంటేమాత్రంకాదా?"

"సరేగాని...ఆకూరవడ్డించుకో..."

"నీవు వడ్డించ్మకుందూ..."

ఇద్దరూ నవ్వుకుంటూ ఉంటారు.

ప్రభావతి శరీరం ఆనందపులకిత మయింది.

ఎంతకాలనికి చెవులపండువుగా చిరునవ్వు విన్నాననుకొంది—

అంతలో చెప్పులచప్పుడయింది...

ఎవరది?

"పిన్నిగారు..."

"ఓహో! ఆనందా? రా నాయనా రా!"

బావా మరదళ్ళ నవ్వువిన్న, ఆనందునకు అనుమాన పిశాచం వెకిలినవ్వు నవ్వినట్లయింది.

వారిరువురిని చూచాడు. వారిగుండెలో రాయిపడింది...పైకి వినయకుమారుడెంతో వినయంగా...

"రా...ఆనంద్—రా... ముగ్గురంకలసి భోజనం చేద్దాం." అన్నాడు.

" వద్దులే...వినయా ! పిన్నిగారికేదో దెబ్బతగిలిందని గోవింద్ చెబితే వచ్చాను. "

" అవును...ఏం...దాంట్లో ఆశ్చర్యమేముంది ? "

" మీరు చెప్పకుండా డాక్టర్ని పిలుచుకొనివచ్చి, మా అమ్మ ప్రాణం కాపాడింది గోవిందే...నీతో ఈసంగతి చెప్పింది గోవిందే... గోవిందుకు మనమంటే ఎంతదయ ? "

" అవును...మీకుటుంబం అంటే అతనికి పంచప్రాణాలు "

అంటూ సుందరివంక చూచాడు...సుందరి భయంతో తల వంచుకుంది...

" ఇటు వినయకుమారుడు—అటు గోవిందుడు—సుందరి హృదయాన్ని చుట్టుకొన్న రెండుపూలతోటలు. ఈరెండు తోటలూ గడిస్తేనే కాని నన్ను పొందలేదు. "

అనుకుంటూ ఆనందుడు ప్రభావతిని చూడటానికివెళ్లాడు. కోరలు పెరికిన కోడిత్రాచు బుసలు కొడుతున్నట్లు—నిట్టూర్పులు విడిచే ఆనందుని ముఖంచూచింది ప్రభావతి. క్రోధాసూయలు చిందే అతని కన్నుల నవ లోకించింది. చేసేదేమీలేక ఒక్కనిట్టూర్పు విడిచింది...

" పిన్నిగారూ ? ఎలాగుంది ? "

" బాగానేఉంది నాయనా ! మరేమీ పరవాలేదు. "

" ఏదో పెద్దవారు కదూ ! అందుచేత దెబ్బతగిలిందంటే గజ గజ లాడిపోయాను. "

" మరేమీ భయంలేదు..." పాపీచిరాయు " వని నేనింకా నూరేండ్లు బ్రతుకుతాను. "

" అ—హా ! అలా అనకండి... "

" ఉన్నా సంగతది "

అలా పదినిమిషాలు క్షేమసమాచారాలు మాట్లాడుకున్నారు.

“ పిన్నిగారూ ! ఇంక మేము వెళ్ళివస్తా...సుందరీ! లే పోదాం.”

“ సుందరిని అప్పుడే తీసుకువెళ్ళిపోతావా బాబూ ! ఏదో రెండు రోజులు ఉంచరాదూ ! ”

“ ఎందుకండీ—మళ్ళీ అప్పుడప్పుడు వస్తూఉంటుందిలెండి...”

“ సీదయ. ”

“ సుందరీ ! ఊ...లే...ఇంకా రావాలనిలేదా ? ”

ఆమె గజగజ లాడిపోయింది. మారుమాటాడలేపోయింది...

“ అత్తమ్మా ! వెళ్ళివస్తా ! మళ్ళీ త్వరలోనే వస్తాలే... బావా...”

“ మంచిది...సుందరీ !”

ఇరువురూ ఒకరినొకరు అతి దీనంగా చూచుచున్నారు. ఆనంద్ కుర్చీందాటాడు...

కటికి కసాయివానివెంట వెళ్ళే మేకపిల్లలా ఆమె కనులనీరు తుడ్చుకుంటూ వెళ్ళిపోయింది...

“ వినయా ! సుందరి వెళ్ళిపోయిందా ! ”

“ వెళ్ళిపోయిందమ్మా ! వెళ్ళిపోయింది.. వెళ్ళక మనయింట్లో ఉండిపోతుంది ? ”

అంటూ అలాగే పడకకుర్చీలో కూలపడ్డాడు...అతని విషణ్ణ వదనం ఆమె చూడలేపోయింది...

“ చిన్నప్పట్నించీ పెంచి పెద్దవారినిచేసినా—పెళ్ళిళ్ళయ్యే సరికి బిడ్డలపైన అధికారం ఉండదుకదా ! ”

“ ఎన్నటికీ ఉండదు...”

" వద్దులే...వినయా! పిన్నిగారికేదో దెబ్బతగిలిందని గోవింద్ చెబితే వచ్చాను."

" అవును...ఏం...దాంట్లో ఆశ్చర్యమేముంది?"

" మీరు చెప్పకుండా డాక్టర్ని పిలుచుకొనివచ్చి, మా అమ్మ ప్రాణం కాపాడింది గోవిందే...నీతో ఈసంగతి చెప్పింది గోవిందే... గోవిందుకు మనమంటే ఎంతదయ?"

" అవును...మీకుటుంబం అంటే అతనికి పంచప్రాణాలు"

అంటూ సుందరివంక చూచాడు...సుందరి భయంతో తల వంచుకుంది...

" ఇటు వినయకుమారుడు—అటు గోవిందుడు—సుందరి హృదయాన్ని చుట్టుకొన్న రెండుపూలతోటలు. ఈ రెండు తోటలూ గడిస్తేనే కాని నన్ను పొందలేదు."

అనుకుంటూ ఆనందుడు ప్రభావతిని చూడటానికివెళ్లాడు. కోరలు పెరికిన కోడెత్రాచు బుసలు కొడుతున్నట్లు—నిట్టూర్పులు విడిచే ఆనందుని ముఖంచూచింది ప్రభావతి. క్రోధాసూయలు చిందే అతని కన్నుల నవ లోకించింది. చేసేదేమీలేక ఒక్కనిట్టూర్పు విడిచింది...

" పిన్నిగారూ? ఎలాగుంది?"

" బాగానేఉంది నాయనా! మరేమీ పరవాలేదు."

" ఏదో పెద్దవారు కదూ! అందుచేత దెబ్బతగిలిందంటే గజ గజ లాడియాను."

" మరేమీ భయంలేదు..." పాపీచిరాయు " వని నేనింకా నూరేండ్లు బ్రతుకుతాను."

" అ—హా! అలా అనకండి..."

" ఉన్నా నంగతది"

అలా పదినిముషాలు క్షేమసమాచారాలు మాట్లాడుకున్నారు.

"పిన్నిగారూ! ఇంకమేము వెళ్ళివస్తా...సుందరీ! లే పోదాం."

"సుందరిని అప్పుడే తీసుకువెళ్ళిపోతావా బాబూ! ఏదో రెండు రోజులు ఉంచరాదూ!"

"ఎందుకండీ—మళ్ళీ అప్పుడప్పుడు వస్తూఉంటుందిలెండి..."

"సీదయ."

"సుందరీ! ఊ...లే...ఇంకా రావాలనిలేదా?"

ఆమె గజగజ లాడిపోయింది. మారుమాటాడలేపోయింది...

"అత్తమ్మా! వెళ్ళివస్తా! మళ్ళీ త్వరలోనే వస్తాలే... బావా..."

"మంచిది...సుందరీ!"

ఇరువురూ ఒకరినొకరు అతి దీనంగా చూచుచున్నారు. ఆనంద్ గుమ్మందాటాడు...

కటికి కసాయివానివెంట వెళ్ళే మేకపిల్లలా ఆమె కనులనీరు తుడ్చుకుంటూ వెళ్ళిపోయింది...

"వినయా! సుందరి వెళ్ళిపోయిందా!"

"వెళ్ళిపోయిందమ్మా! వెళ్ళిపోయింది.. వెళ్ళక మనయింట్లో ఉండుకుంటుంది?"

అంటూ అలాగే పడకకుర్చీలో కూలపడ్డాడు...అతని విషణ్ణ వదనం ఆమె చూడలేపోయింది...

"చిన్నప్పుట్నించీ పెంచి పెద్దవారినిచేసినా—పెళ్ళిళ్ళయ్యే సరికి బిడ్డలపైన అధికారం ఉండదుకదా!"

"ఎన్నటికీ ఉండదు..."

వారి నాలుగుకళ్లూ అలా ఆలోచనలో మునిగిపోయాయి. కిటికీ సందులలోనుంచి శ్రావణాంబుదాలను చూస్తూ ఉన్నాయి...జరగబోయే విషయాలను ఆలోచించాలి. జరిగిపోయిన విషయాలగురించి ఎంత ఆలోచిస్తే ప్రయోజనమేముంది?..."గతంనచామి—కృతం స్మరామి!"

* * * *

౨

పదిహేనురోజులు గడిచాయి.

ప్రభావతి లేచితిరుగుతూఉంది...

ఈమధ్య సుందరి నాలుగయిదుసార్లు వచ్చివెళ్ళింది...

ఆనాలుగయిదుసార్లూ బావా మరదండ్రు అనుభవించిన ఆనందం—వారికే తెలుసు. వారి ముఖాలుచూచి, వారిని వేరుచేశానే అని పడేబాధ—ప్రభావతికే తెలుసు.

సుందరి వెళ్ళిపోగానే వినయకుమారుడు తనగదిలో బెంగతో పండుకొనేవాడు ..ఏదన్నా పలుకరిస్తే మాటకుమాట సమాధానం చెప్పేవాడు. అంతే—మనసిచ్చి నవ్వుతూ తల్లితోగాని, తదితరులతోగాని ఒక్కసారి మాట్లాడిన పాపాన్నపోలేదు. అతని దినదినచర్య చూస్తున్న తల్లిహృదయంలో—సుడిగుండం వలయాకృతంగా తిరిగి, మిన్ను ముదుతున్నట్లుంది...అతడొకొక్కవేళ—పూర్వం బావను చేసుకుంటానికి వీలు లేదనప్పుడు సుందరి కన్నీరు మున్నీరుగా ఏడ్చినట్లు—అర్ధరాత్రివేళ కొన్నిపర్యాయములు కన్నీరుకూడ కార్చటం ఆమె కళ్ళారాచూచింది.

"పాపం! వినయకుమార్ బెంగతో కృసించుకుపోతున్నాడు. బావామరదళ్ళను వివాహంచేసి—వారిభావి సంపన్నజీవితాల్లో ఆనందగంగాతరంగిణిని ప్రవహింపజేసి—వలపు బంగారు పూలను పూయించకుండా—విషవాయువులను ప్రజ్వరింపజేశాను.

ఎందుచేత ?

నాస్వార్థపరత్వం చంపుకోలేక ఎదటివారి హృదయాన్ని అర్థంచేసుకోలేక విశ్వమానవ కల్యాణానికి వెలిసే పచ్చతోరణాలను, కనులవిందుగా గాంచలేక.

దీనికి ఫలితం ?

వారి విషాదాగ్నిలో వారు దగ్ధమైపోవటం—వారి కన్నీటిలో వారు మునిగిపోవటం—ఆదృశ్యాన్ని నేను చూచి ఆనందించటం—ఆహా ! ఎంత శోచనీయంగా ఉంది. నా జీవనస్థితి ! ఎంత విషాదంగా ఉంది నా భావ పర్యటనం ! .

నా చేతులతో అల్లారుముద్దుగా పెంచి పెద్దదానిని చేసిన సుందరి—తానుకోరిన 'బావ' నిచ్చి వివాహం చేయలేపోయాను ఆమెను అభాగినిని చేశాను. అనదను గావించాను...

ఇంక కన్నకుమారుడైన వినయుని కోర్కె—కూడా తీర్చకుండా. రూపుదాల్చిన స్వార్థమూర్తిలాగ బ్రతికి ఉండనా? నాలుగురోజులలో ముగిసిపోయే నావిషాదపాత్ర—కన్నకుమారుని కన్నీటిలో స్నానం చెయ్యాలా? ఎంత మూర్ఖత్వం ! కన్నతల్లులు తమబిడ్డలు కోరినవి సమకూర్చి, వారి ఆనందాన్ని అభిలషిస్తారు కాని, వారి భగ్నజీవితాలను వాంఛిస్తారా? అలా వాంఛించేవారు భూలోకరాక్షసులు కాక సామాన్య మానవు లౌతారా?...

అని తలుచుకుంటుంటే ప్రభావతి హృదయసుమం, రేకురేకులూ ఊడి నేలమీాద పడిపోతున్నట్లుంది...

* * * *

ఆరోజు అర్థరాత్రి.

వినయకుమార్ కాళ్లు బల్లమీద వేసి, పడక కుర్చీలో పండుకున్నాడు వెలుగుతున్న దీపం వెలుగుతున్నట్లేఉంది. తగ్గించన్నైన్నా తగ్గించలేదు. వాడిపోయిన పద్మంలాగున్న అతని ముఖంచూస్తూ ప్రభావతి రాతి ప్రతిమలా నిలబడిపోయింది. చెదిరిపోయిన అతని తల—మాసిపోయిన అతని బట్టలు—పెరిగిపోయిన అతని గడ్డం—చెమటపట్టి శరీరం—వాడిపోయిన ముఖం— చూస్తూఉంటే ఎవరిహృదయానికి జాలికలుగదు? కన్నతల్లి హృదయం కరిగిపోకుండా ఉంటుందా?

అతనినిచూస్తున్నకొలది ఆమె కడుపు చెరువై . పోయింది.

అతడు కుర్చీలో అటు నిటూ కదలాడు.

"దే...వీ! దే...వీ...!!"

అతని పెదాలనుండి ఒక్కొక్క అక్షరం ఎంతో బరువుగా బయటకు వచ్చింది. ఆకలవరింతవిన్న తల్లికడుపు సముద్రమైపోయింది...

నాలుగునిమషాలు గడిచాయి.

"దేవీ! దేవీ! నన్ను మరచిపో...మా అమ్మ...మనసు...కష్టపెట్ట...లే...ను...ఊ...దే...వీ..."

ఆకలవరింత వింటున్న ఆమె పులకిత రోమాంచం—ఒకొక్కటి ఒకొక్కసూది పోటులా నాటింది.

అతని దుర్భర హృదయవేదన చూచి అక్కడ నిలువలేపోయింది.

అక్కడ నుంచీ లోపలకు వెళ్ళిపోయింది...

కాని ఆమెకాళ్ళు వణికిపోయాయి...

అటు లోపలకు వెళ్ళలేపోయింది—అక్కడ నిలవలేపోయింది.

తడబడే పెదాలతో

"బాబూ! వినయా!"

అని లేపింది.

అతడు ఉలుక్కుబడి లేచాడు.

" అమ్మా ! ఏం ఇలాగొచ్చావు ? "

" ఏమీలేదు నాయనా ! "

" అదేమిటి... అప్పుడే 12 గంట లయిందే... ఈ అర్ధరాత్రిలో నిద్రపోకుండా ఇలావచ్చావే అమ్మా ? సుస్తీచెయ్యలేదు కదా ? "

" సుస్తీ చేస్తుందా ? ఏమీ చెయ్యదు... నాయనా ! నీవు కలత నిద్దరలో కన్నుమూస్తే—నేను కునుకనిద్దరలో కన్నుమూస్తానా ? "

" కలతనిద్రకు కర్మమేమిటమ్మా ! నేను సుఖంగా నిద్రపోతున్నానే ! "

" నీకు తెలియకుండానే నీహృదయం పడేబాధ, నీవుకలవరించే కలవరింత, తెలుసుకున్నా ! వినయా ! ఈమంచంమీద కూర్చుందాం ఇలారా ! "

వాళ్ళిద్దరూ మంచంమీద కూర్చున్నారు...

" నాయనా ! వినయా !

అంటూ చంటిపిల్లవాని తలనిమురినట్లు అతనితల నిమిరి—అతని తలను హృదయానికి హత్తుకుంది. ఆ మాతృప్రేమకు అతడానంద పరవశుడయ్యాడు.

" అమ్మా ! "

" వినయా ! తండ్రీ ! "

ఆమె కన్నులనీళ్ళు చెక్కిళ్ళమీదనుంచి కారాయి.

అది చూచిన అతని హృదయం ' ఝల్లు ' మంది...

" అమ్మా ! ఇలా ఏడుస్తానే ? నేనేమిచేశానే... చెప్పవు "

"తండ్రీ! వినయా! నీవంటి బుద్ధిమంతుడు తప్పుకూడా చేస్తాడా తండ్రీ! నీవంటి శాలీలుని కనబట్టే నీతండ్రి ధన్యుడయ్యాడు. నీతల్లి జన్మతరించింది..."

"బిడ్డలను చూస్తే తల్లిదండ్రులకు అలాగే ఉంటుందిలే అమ్మా! అది సహజం!"

"నీతో పోల్చబడటానికి ఈ ఊరిలో మరొక డున్నాడా నాయనా?"

"అయితే ఈ కన్నీ రెందుకమ్మా?"

"నేటివరకు నీకు ఆనందం కలిగించలేదని; నీకోరిక తీర్చలేదని; కన్నతల్లి కర్తవ్యం నెరవేర్చలేదని;..."

"ఏమిటోనమ్మా! నీవుచెప్పేది నాకేమీ అర్థంకావటంలేదు."

"నాయనా! ఈనెలలో నీవివాహానికి ముహూర్తం."

"అదేమిటమ్మా?"

"అవును...నామాట వినవా?"

"ఎందుకవినను...ఎవర్ని చేసుకోవాలి..."

"నీవుప్రేమించి పెండ్లిచేసుకోవాలనుకొన్న పిల్లనే"

"ఎవరిని?..."

"తెలియదా?...నీ...దే..."

"దే...వి—నా!"

"అవును. దేవినే! మానిరుపమదేవినే..."

ఆమాట వినేసరికి అతడు ఆనందం పట్టలేపోయాడు. అతని కన్ను లానందంచే ఎన్నిమార్లో స్పందించాయి. దేవినవ్వుతూ అతని మెడలో పూలమాల వేస్తున్నట్లుంది...అతడామె మెడకు మంగళసూత్రం కడు

తున్నట్లు—సన్నాయి వాళ్లు "రాముడు పెండ్లికొడుకాయెనె..." అనే పాటపాడుతున్నట్లు...ఇంకా ఎన్నో ఆనంద దృశ్యాలతని కన్నుల పడుతున్నట్లు కనుపించాయి మెరుపుల్లా మెరిసిపోయాయి...ఆ ఆనంద వార్త ఎప్పుడు దేవికి చెప్పవా అని ఆతృత పడిపోయాడు.

"అమ్మా! ఏం? ఇలామారిపోయావు? ఎవరన్నా చెప్పారా?"

"అవును. నామనసేనాకు ప్రబోధించింది...వినయా! నీయిష్ట ప్రకారం నీవు దేవిని వివాహంచేసుకో...కా...ని..."

"ఏం...? మళ్ళీ సంశయం?"

"సంశయమేమీలేదు...నీవు చేసుకో...కాని...కొన్ని కార ణాలచేత నేనుమాత్రం నీపెళ్ళికి రాలేను."

"నీవు రాకపోతే ఎలాగమ్మా! నాకెంకెవరున్నారు?"

"నాయనా! వినయా! నామాటవిను. ఎందుకు నేనిలా చేస్తు న్నానో నీకు తరువాత చెబుతాను. నాకోరిక నెరవేర్చదలుచుకుంటే నీవువెళ్ళి పెళ్ళిచేసుకో. నాటినుంచి దేవితో వేరే కాపరంపెట్టు. నీకు నెలకెంత కావలసివస్తే అంతడబ్బు ఇక్కడనుంచి పంపుతాను. నేను వచ్చే వరకు నీవు అక్కడేఉండు..."

"ఏమిటమ్మా! ఈమాటలన్నీను?"

"ఇవన్నీ నీకు కష్టంగానే ఉంటాయి. నాకు తెలుసును. కాని మార్గాంతరం లేకపోవటంచేత నిన్నిలా కష్టపెట్టవలసి వచ్చింది."

"నీవిలాగంటుంటే నాపెండ్లినీకిష్టమని ఎలాగనుకుంటానమ్మా!"

"లేదు నాయనా లేదు, భగవసాక్షిగా నాకు ఇష్టమే...నీవు వెళ్ళి చేసుకో...నాకోరిక నెరవేర్చదలుచుకుంటే నీవు విను. లేకపోతే లేదు. తరువాత నీయిష్టం..."

"... ..."

"వినయా ! నామాట వినవా? నాకోరిక నెరవేర్చవా ? నాఆజ్ఞ పరిపాలింపవా ?"

అతడు గడగడ లాడిపోయాడు. వంచినతల ఎత్త లేపోయాడు. ఆమె మాటకు వ్యతిరిక్తంగానడిస్తే ఎక్కడ ప్రమాదం సంభవిస్తుందో నని అదలిపోయాడు...

"ఏం ? వినయా ?"

"నీయిష్టమమ్మా ! నీగురించి ఏదైనా చేస్తాను..."

"సంతోషం నాయనా ! సంతోషం !"

అంటూ ఆమె తనగదిలోకి వెళ్ళిపోయింది.

ఆమె హృదయం అర్థంకాక ఆలోచనలలో మునిగిపోయాడు. ఆ అర్థరాత్రివేళ ఆతల్లి కొడుకులిద్దరూ అయోమయ ప్రపంచంలో మునిగిపోయారు...

* * * *

కాలం గడచిపోయింది.

కల్యాణపురం కల్యాణులకు కల్యాణం చేయించటంలో మంచి గట్టిపేరు సంపాదించింది.

పెండ్లంటే— పెండ్లి—

ఎవరిది ? ఎవరిది ? అని నాలుగు మూలలనుంచీ ప్రశ్నలపైన ప్రశ్నలు—శరవర్షంలా కురిశాయి...

పెండ్లి పందిటిలో సన్నాయి వినబడింది...

దేవి తండ్రి ప్రసాద్ ఆనందం అపుకోలేక పోయాడు. ఆపెండ్లికి పెద్దలెవరు ?

సుందరీ ఆనందులు—

దేవీ వినయులు అనురాగంతో ఒకరి నొకరు చూచుకున్నారు.

దేవి మెడలో వినయకుమారుడు . మంగళపవిత్రమైన, మంగళ సూత్రం కట్టివేశాడు.

దేవి ఇప్పుడు వినయకుమారుని భార్య.

సుందరీ ఆనందులు వధూవరుల మెడలలో పూలమాలలు వేశారు—

అటు దేవీ ఆనందులు—

ఇటు సుందరీ వినయకుమారులు—

ఏవో అర్థంకాని వింత వింత భావాలతో చూచుకొన్నారు.

ఆ చూపులతోటే ఏవో మాట్లాడుకున్నారు.

మొత్తానికి పెండ్లి అయిపోయింది.

* * * *

"పెండ్లి అయిపోయిందా ?"

"ఆ...దివ్యంగా అయిపోయింది. అవే బాజాలు—అవే మందు గుండు సామానులు—వారే పెళ్ళివారు—చక్కటి భోజనాలు— అందచందాలు చిందే అనురాగ దంపతులు—"

ఇలా ప్రతిభావతికి జవాబుచెబుతూ కొంతమంది వెళ్ళిపోయారు.

"అయిపోయింది—పెండ్లి అయిపోయింది—ఇంక నాజీవితం అయిపోతుంది—వారి ఆనందం ముగిసిపోతుంది—ఆనందుని ప్రేమిం చిన ఆమె, మావినయునకెలా ఆనందం కూర్చగలదు? నీటిబుడగలమీద మెరిసే సూర్యకిరణాలనుచూచి వజ్రాలమాలగా భ్రమించాడు. మురి

శాడు. పరవశం పొందాడు. పాపం! అమాయకుడు దయ్యాడు. తన జీవితమాధుర్యాన్ని తానే పాడుచేసుకున్నాడు...కాల విషసర్పం కరాళదంష్ట్రికలతో కాటేస్తే—చిరునవ్వుముత్యాల కాన్కలెవరికిస్తారు? అదిగో! అదిగో పెండ్లిబాజా...నాశవాన్ని శ్మశానానికి తీసుకువెళ్ళే బాజా... అవేనవ్వులు—నాచితిదగ్గర ఏడ్పులు...అవే ఆనందాశ్రువులు—నామరణానంతరం విషాదాశ్రువులు ... వినయా! పరిస్థితులు మారిపోతున్నాయి—కాలచక్రం తిరిగిపోతుంది—కనులెత్తి చూడలేవు—కనులనీరు నింపలేవు—కాలేచితిని గాంచలేవు... వినయా... వినయా. నీ ఆనందసౌధంలోనుంచి నామండే చితినిచూడు. దానిని నీవే ఆహుతిచేసుకుంటావో—నిన్నదే ఆహుతి చేసుకుంటుందే—కాలమే నిర్ణయిస్తుంది...

వినయా...వినయా...

ఆమె తూలుతుంటూ ఇంటిలోకివెళ్ళి తలుపులువేసేసి—మంచం మీద పడిపోయింది...వృద్ధురాలవటంచేత పాపం! స్పృహకూడా తప్పిపోయింది.

*　　*　　*　　*

అక్కడ పెండ్లిపందిటిలోనుంచి లోపలగదిలోకి బావా మరదళ్ళు వెళ్లారు...

"సుందరీ! తుదకు నాపెండ్లిచూచి మాఅమ్మ ఆనందించే భాగ్యం నాకులేపోయింది"

"అవును. అక్కడామె ఎంతో బాధపడుతుంది."

"ఆమెనన్ను వేరేకాపురం పెట్టమందెందుకో!"

"ఆమెహృదయం ఆమెకే అర్థంకాదు బావా! అదేమిటో—పెద్దతనంచేత కాబోలు—ఇప్పుడున్నాభావం మరోక్షణం ఉండదు. ఇప్పటిమాట మరోక్షణంలో మారిపోతుంది."

"ఆమెదో క వింతజీవితం."

"ఆమె సుఖంగాఉండదు—మనలను సుఖంగా ఉండనీయదు."

"అయినా సుందరీ! అమ్మనలా ఒంటరిగావిడచి, నన్నువేరే ఉండమనేదానికంటే కఠినశిక్ష మరొకటిఉండదు."

"అలాగే...ఏంచేస్తాం...ఆమె చెప్పినట్లు నడవకపోతే, ఆమెకు మరీ పెట్రేగిపోవడం వస్తుంది..."

"ఏమిటో లే...అంతాకర్మ..."

అలా వారు పెండ్లన్నా ఆనందంకూడా అనుభవించలేదు...

ఎవరిహృదయ భావానుగుణంగా వారు బాధపడుతున్నారు...

న్యాయతా ప్రపంచమే బాధావిలంగాదూ!...

* * * *

3

అదిఒక పెద్దమఱ్ఱివృక్షం. ఊడలచే భూమ్యాకాశాలను కలుపుతూఉంది.

ఆచెట్టుప్రక్కనే ఒక చిన్నపాక.

ఆపాక గోడకిటికీ సందులోనుంచి, తెల్లవారుజామున మూడు గంటలకు, రెండుకనులు మిలమిలామెరిసే రెండుచుక్కలను చూస్తూ ఉన్నాయి...

మఱ్ఱిచెట్టు వేయివేల హస్తాలతో అతనికి చల్లగాలులు అందిస్తూ ఉంది—

అతడెవరు?

మన కలకత్తా "ఎమ్. ఎ. గారు—వినయకుమార్."

పెండ్లయిన తరువాత, మామగారియింట్లో ఉండటం పరువుతక్కువని—తల్లిగారి ఆజ్ఞకు వ్యతిరిక్తముగానడచి, ఆమెకు కష్టం కలిగించి ఆమెయింట్లో ఉండటానికి ఇష్టంలేక—కష్టాలకు లెక్కచేయకుండా ఆయింట్లోనే ఉన్నాడు.

అతనికి రాత్రులందు ఆకాశం చూడటమన్నా, ఆకాశంమీద తళతళామెరిసే నక్షత్రాలను చూడటమన్నా, అపరిమితమైన ఆనందం. అలా ఆకాశాన్నిచూస్తూ, భగవంతుని విశాలసృష్టి నూహిస్తూ, అతని విశాలదృష్టిని వృద్ధిచేసుకుంటూ ఉన్నాడు.

" ( I Hear The Divine Mvsic in Stars ) "

" నేను భగవత్సంబంధమైన సంగీతం నక్షత్రాలలో విన్నాను "

అనే గాంధిగారి అనుభవ పూరితమైన వాక్యాన్ని తలుచుకుంటుంటే—అతని హృదయం ఉన్నత భావాలలో అధివసిస్తూఉంది.

వినయకుమార్ మూడుగంట్లకు లేచి—ఆచల్లని గాడ్పులను తోసుకుంటూ ఆరుబయటలోకి వెళ్లాడు. మంచుబిందువులతో కప్పబడిన మాలతీ సన్నజాజులను, మల్లెపూ మంజరులను చూచాడు. ప్రకృతి రామణీయకానికి ముగ్ధుడైపోయాడు.

కాలకృత్యాలను నెరవేర్చుకొని, అరికనలైటు వెలిగించుకొని, తలదగ్గర గూటిలోపెట్టుకొని, నులకమంచంమీద పండుకొని, మెక్ డూగల్స్సైకాలజీ' ( Mac Dangals' Psyehology ) చదువుతున్నాడు. మానవప్రవృత్తిని అవగాహనం చేసుకుంటున్నాడు. పల్లెటూరువారికి పాఠాలుచెప్పేవిధానం అంతా గ్రహించి, స్వగ్రామంలోనే ఒక బడిపెట్టి, గ్రామీయుల బుద్ధిబలాన్ని వృద్ధిచేద్దామనుకున్నాడు. వారి హృదయాల్లో విజ్ఞానజ్యోతిని వెలిగిద్దామనుకున్నాడు. వారి అభివృద్ధికొరకై తన ప్రాణాలనైనా బలిచేద్దామనుకున్నాడు...

స్వగ్రామసేవే, స్వదేశసేవా సాధమునకు తొలిమెట్టనుకున్నాడు. ఎవరిగ్రామం వారు చక్కపెట్టుకుంటే—ఆనాడే దేశసౌభాగ్య సౌభ్రాతృత్వాలు కరతలామలకం అనుకున్నాడు.

అదీ ఇదీ ఎందుకు—

గ్రామసేవే—దేశసేవ ;

మానవసేవే—భగవత్ సేవ ;

అతని జీవితనావను సంసారసముద్రంలో నడిపే ధ్రువతారే—ఆ రెండింటి భావ సమ్మిశ్రితమైన వెలుగు.

*　　*　　*　　*

ఆనందం మైమరపిస్తుంది.

అతని పక్కనే మరో మంచంమీాద పండుకొన్న ప్రియురాలు మృధుమధురాధ సుధారసాస్వాదనకంటే—కావ్యామృత రసాస్వాదన మందు,అతనికి మమత మెండు రుచిమిక్కుటము. ఆనందము అద్వితీయము.

ఆనందంలో మధ్యమధ్య ఎగ్గెత్తి చదవటం మొదలుపెట్టాడు. నిరుపమదేవికి నిదురపట్టు సమయము, ఆతెల్లవారుజాము. అప్పుడే అతని చదువు ప్రారంభం. కిటికీ సందులనుంచి పడే చక్కని వెన్నెలను పాడు చేసేదీపం. ప్రశాంతాన్ని భంగంచేసే చదువు ఆమెకు వళ్ళుమండింది.

చల్లని పిల్లతెమ్మెరలకు, అల్లలనాడు, ఆరాళకుంతలముల అరచేతితో ఆవలకుతోస్తూ—

"వినరయా !"

"... ..."

"వినరయా !"

అతని ఆనందం అతనిది. చేతులు తిప్పుకుంటూ మధ్య మధ్య 'ఓహోహో ! ' అంటూ గొంతెత్తి చదవటం ప్రారంభించాడు.

"వినయా పిలుస్తుంటే వినబడటంలేదు ?"

"ఓహో ! దేవీ లేచేవా ?"

"బుడబుక్కలవాడు రాకుండా ప్రారంభించావే ?"

"నిజమే. ఇవాళ త్వరగా మెలుకువ వచ్చింది."

"కోడికూతకు తొలికూతలాగుందే నీచదువు ?"

"అవును. అలాగేఉంది చూస్తే."

ఆమె పాదాలనుంచి కంఠంవరకూ రగ్గు కప్పుకున్నా చలికి గజ గజ లాడిపోతూఉంది.

"నీకూ తోచిందా...సంతోషించాంగాని చలేసి చస్తూఉంటే, శీతాకాలంకూడా కిటికీతలుపులు తీస్తావే ?"

"రగ్గు కప్పుకున్నావుగా...ఇంకా చలేమిటి ?"

"చాల్లే బాగాచెప్పావు. మొదటా కిటికీతలుపులెయ్యి—తరువాత చూద్దాంలే..."

"అలాగే...అలాగే...

అతడు వినయంగాలేచి తలుపులు వేసేశాడు.

"ఏందేవీ ! చలేస్తూఉందా ?"

"నాచలిబాధ నీకేంతెలుస్తుందిగాని...ఏదీ...ఆలైటు కొంచం తగ్గించుబాబు—చాలా గొప్పవాడవుగాని..."

"అదేమిటిదేవీ ! లైటు తగ్గిస్తే చదువుకుంటం ఎలా ?"

"అదేమిటికుమార్ ! లైటు పెద్దదిచేస్తే నిదురపోవటం ఎలా?"

"అయినా తెల్లవారుజామున నిదురేమిటి ?"

"అయినా పెళ్ళయింతరువాత చదువేమిటి ?"

"పెళ్ళయితే చదువు మానేయాలా దేవీ ?"

"వినయా ! అన్నీ తెలిసినవాడవు, బాగా చదువుకున్నవాడవు,

నీవే అలాగంటే ఎలాచెప్పు? పెండ్లిచేసుకుందెందుకు? నీపి్రియురాలికి ఆనందం కలిగించటానికి—నీవు ఆనందం పొందటానికి—అంతేకాని ముక్కుమూసుకొని, మూడుపొద్దులూ, ముక్కోటి దేవతలను కొలిచే మునులవృత్తి నవలంభించటానికి కాదు..."

"దేవీ! ఆనందానికి అంతులేని మార్గాలు. చదువుమాత్రం ఆనందం కలిగించదూ?"

ఆమాటకు ఆమెకాగ్రహం ఆగలేదు.

లేచి కూర్చుంది...

"వినయా! నీవింత వెఱ్ఱివాడవై పోతావని అనుకోలేదు. పండితుల ప్రబోధం బోధపరుచుకోలేవనుకోలేదు. రఘువంశ మహాకావ్యంలో మహాకవి కాళిదాసు నిర్వచించిన నాలుగు ధర్మాలు మరచావా?

'శ్లో॥ శైశవేభ్యస్త విద్యానాం—యౌవనే విషయైషిణాం।
వార్ధకే మునివృత్తీనాం—యోగేనాన్తే తనుత్యజాం॥'

అని తెలివితక్కువవాడై నిర్వచించాడంటావా?

చిన్నతనంలో విద్యాభ్యాసం—యౌవనంలో విషయసుఖలాలసత—వార్ధక్యంలో మునివృత్తి—తుదకు యోగాభ్యాసంలో, ఆత్మావలోకనంచే శరీరయాత్రచాలించి జీవన్ముక్తులవటం—ఇవేకదా మానవాచరణ కయోగ్యములైన విధులు...ఏకాలానికి యోగ్యమైన పనులా కాలంలో చెయ్యాలి...అందుకే పూర్వం బ్రహ్మచర్యానంతరం వివాహం చేసుకొనేవారు...అంతేకాని వివాహానంతరం బ్రహ్మచర్యం ప్రారంభించి విద్యాభ్యాసం చేసేవారుకాదు...

వినయా!

మహాకవుల వాక్కులు చులకనగా చూడకూడదు—వారి వాక్కులు దూది పింజలుకావు—

అమృత ఘటికలు—

వజ్రపు తునకలు—

తెలిసిందా...వినయా...వింటున్నావా...

"దేవీ ! వింటున్నాను అన్నీవింటున్నాను. అర్థంచేసుకుంటున్నాను ...నీ తెలివితేటలకు లోలోన మెచ్చుకుంటున్నాను...కాని కాళిదాసుని కాలంవేరు—ఈకాలంవేరు. నాటికాలాని కవి అమృత తుల్యాలే— ఒప్పుకుంటాను. కాని ఈనాటి మానిస స్సాంఘిక జీవితానికవి తోడ్పడ లేవు..."

"అంతేలే నీకు తోయ్యదు ఇతరులు చెబుతే వినవు. వింటే నీపరిజ్ఞానముందిలే..."

అంటూ ఆమె శరవేగంగా, చావిట్లోకివెళ్ళి, కుర్చీలో కూల బడింది.

అతడొక్క నిట్టూర్పు విడిచాడు.

భార్యా కనుబొమలు చిట్లిస్తే గడగడలాడే మహావీరుల్లా కాకుండా—భార్యా పొరపాటున అలిగిందాఅంటే మానాభిమానాలు చంపుకొని, రోజులు రోజులు బ్రతిమలాడి అలకతీర్చే మహాశూరుల్లా కాకుండా—కూర్చున్న మంచంమీదనుంచి కదలనైనా కదలలేదు మన వినయకుమార్.

ఆమె వెళ్ళిపోయింది...

"పాపం ! నన్నుచేసుకొని నాహృదయం అర్థంకాక ఎంత బాధ పడుతుంది ?"

అని ఒకనిట్టూర్పువిడిచి, పుస్తకంచూడటం ప్రారంభించాడు— అర్థం అయినా కాకపోయినా పేజీలు తిరగవేయటం ప్రారంభించాడు...

చదువుకొన్నంత మాత్రంలోనే అనుకూలదంపతు లౌతారంటావా ? ఎంతమాట ?

*　*　*　*

సాయంకాలం అయిదుగంటలు దాటింది. పక్షులకుకూడా సంసార తాపత్రయం ఉంది కాబోలు, ముక్కులనేదో ఆహారంకరచుకొని, గూటిలో ఉన్న చిన్నపిల్లలకు తీసుకువెళుతున్నాయి...

ఇంటివద్ద ఆవుదూడలు "అంబా ! అంబా !" అంటూ అటమటిస్తూఉంటే వాటికి తీయని పాలిచ్చి ఆకలి తీర్చటానికని, గోమాతలు వాత్సల్యపూరిత నయనాలతో వెళుతూ ఉన్నాయి...

తమకోసం తలుపుల చాటునుంచి, వంగి వంగి తొంగిచూచే ప్రియురాండ్ర కాటుక కళ్ళను తలచుకుంటూ, పగలు పగలల్లా పడిన కష్టాన్ని మరచిపోదామని, మమతతో వయసు మరలని కాపువాండ్రు తమ తమ ఇళ్ళకు పశువులను తోలుకుంటూ వెళుతున్నారు...

పశువత్సాదులనుంచి, మానవుని వరకు, సకల ప్రాణికోటికి విశ్రాంతినిచ్చే ఆసాయంసమయం—ఆసంధ్యారుణ కాంతులు—ఆమబ్బుల పరుగులు—చూస్తూఉంటే ఏలలితకళా ప్రియుని ముగ్ధహృదయం, స్నిగ్ధముకాదు ?

ఆసాయంతన మధుర దృశ్యాలను చూస్తూఉన్న మన వినయకుమార్ హృదయం ఆనంద తరంగితమైనది.

అందరూ వెళ్ళిపోతున్నా పాపం ! చంద్రయ్యమాత్రం ఇంకా 'కట్టెపుల్లల' ను మాత్రం కొడుతూ ఉన్నాడు. అతని కష్టజీవితం చూస్తే వినయునకు జాలివేసింది. తోటిసోదరుడిలా చెమటూడ్చి కష్టపడి జీవిస్తూఉంటే — నేను సుఖజీవితాన్ని అభిలషించే అంతమూర్ఖుణ్నా?

అతనిదగ్గరకు వెళ్ళాడు.

అతడు గొడ్డలి క్రిందపెట్టి—

"బాబుగారు! దణ్ణాలు!"

"నమస్కారం!"

"ఏంబాబు! ఇట్టాగొచ్చారు!"

"ఏమీలేదు. చంద్రియ్యా! ఇంకా పనిచేస్తున్నావే?"

"బాబూ! పనిసేయకపోతే ఎలాబాబు! రెక్కాడుతేనే డొక్కాడుతుంది...లేకపోతే పిల్లాపాపా అంతాప స్తే!"

"అవును."

"అయినా బాబూ! మొగదల మొగోడయ్యాక, కట్టపడి గంజి నీళ్ళకైనా గడించుకోపోతే ఎట్టా చెప్పండి?"

"నిజం చంద్రయ్యా! నిజం!"

"అదేటోగాని బాబు! నేనొప్పుడన్నా కూసంత బద్దకిత్తే "చంద్రం! ఇయ్యాల పనిలోకెళ్ళవేరా!" అని మానాన్నంటే ఎక్కడ్లేనిసిగ్గొచ్చేది. ఆపలంగా గొడ్డలి తీసుకొని బయలుదేరేటోణ్ణి..."

"చంద్రయ్యా! మీఇంట్లో మరోక గొడ్డలిఉందా!"

"ఉందిబాబు! ఏంబాబు! ఏటన్నాపనుందా?"

"ఉంది...రేపాగొడ్డలి తీసుకురా! ఇద్దరం కట్టెలు కొట్టుకొనే ఆనందంగా జీవిద్దాం"

చంద్రం ఆశ్చర్యపోయాడు...

"అదేటండీ బాబు! అంతమాటన్నారు? ఓరన్నా యిక గలరు..."

"వింటే తప్పేముంది చంద్రం! నీవెలాపుట్టావో నేనూ అలా పుట్టాను; నీకెటువంటి ఆకలుదప్పు లున్నాయో, నాకూ అటువంటి ఆకలి

దవ్వులే ఉన్నాయి; నీకెటువంటి సుఖదుఃఖాలు ఉన్నాయో, నాకూ అటువంటి సుఖదుఃఖాలున్నాయి; తెలిసిందా! చంద్రం! కాబట్టి నాకు నీ రెండవ గొడ్డలి రేపు పట్టుకురా!"

"ఎంతమాటన్నారు బాబు! నేనే గొడ్డలిస్తే నా ప్రాణాలు పద్మావతమ్మగారు తీసేయరూ!"

"మరేమీ పరవాలేదు చంద్రం! మనమేమీ తప్పుపని చేయటంలేదు."

"అంత సమువుసదివి—కూలిపని సేత్తారా!"

"అవును. దానిలోనే స్వేచ్ఛ ఉంది. దానిలోనే పరమపవిత్రమైన స్వాతంత్రదీక్ష ఉంది."

"బాబూ! మీరు సొప్పేది నాకేటో బోధపడతంలేదు, కామట్టి నన్నిడిసేయండి...నేపోతా..."

"పదపద...మీ యింటికి నేనూ వస్తాను. అక్కడ గొడ్డలి తీసుకొని మా యింటికి వెళ్ళి, కోడి కూయగానే పనిలోకి వచ్చేస్తాను."

"ఇంటిద్వారం ఎక్కడనా ఉందంటుండీ."

"ఎక్కడా లేపోతే మనం చూపెడదాం. రాబోయే నిరుద్యోగ విద్యార్థులకు, బ్రతుకు తెరువు చూపెడదాం. స్వతంత్రజీవితం నేర్పుదాం...ఆత్మౌన్నత్యానికి పునాదివేద్దాం..."

"బాబయ్యా!"

"మాటలాడక పద చంద్రం! తరువాత విషయం చెబుతాను." పాపం! అతడేమీ మాటలాడలేపోయాడు.

ఇద్దరూ చంద్రం యింటికి వెళ్ళారు.

చంద్రం గడగడలాడుతూ, ఎవ్వరికీ తెలియనీయకుండా గొడ్డలి

తీసుకువచ్చి ఇచ్చాడు. ఎనిమిదుగుమూరుడూ బ్రహ్మానందంతో అందు కున్నాడు...

"చంద్రం ధన్యుడను ! నాజీవితానందానికి మార్గదర్శివి నీవు గురుత్వవయ్యావు...ధన్యుడను. శలవు...రేపు ఉదయం ఆచెట్లవద్దే కలుసుకుందాం..."

అంటూ బ్రహ్మానందంతోటి బయలుదేరాడు. అతనిలో అతడు వెఱ్ఱివానిలా నవ్వుకున్నాడు. చేతిలో గొడ్డలి అటునిటూ తిప్పాడు... దానివంక పదిమార్లు చూచాడు.

"దొరికింది. మార్గం దొరికింది. పాపభూయిష్టమైన మహాకర గ్యాన్ని, విచ్ఛేదంచేసేటట్లీ—నిరుద్యోగమును విచ్ఛేదంచేసే సాధనం దొరికింది. నేడు ఆంగ్లేయుల నూతన విద్యావిధానము (English Education on Modern lines ) విజ్ఞాన ప్రదమైన వచ్చును. విజ్ఞానం నిమిత్తం విద్యనభ్యసించిన, అభ్యసించవచ్చును. (Education for education sake) ఆనందం పొందవచ్చును. అనురాగజీవితం గడపవచ్చును. ఆధ్యాత్మికచింతన వృద్ధిచేసుకోవచ్చును. ఆముష్మిక సుఖాన్ని అరచేతిలో దాల్చవచ్చును...

అంతేకాని విద్యాభ్యాసం కేవలం ఉద్యోగాభిలాషతో చేస్తే, అది కేవలం అవివేకం; అన్యాయం; మూర్ఖం. పవిద్యాలయాలు (High Sehools & Colleges) గాని, పవిశ్వ విద్యాలయాలు (Universities) గాని, మన ఆశలు తీర్చలేవు. ఆశయాలు నెరవేర్చ లేవు. ఆకలి చల్లార్చలేవు.

ఏనాడు మన భారతదేశంలో మన కులవృత్తులను మనం అవలం భిస్తామో—ఏనాడు స్వార్థపరత్వాన్ని చంపుకొని, స్వాభిమానాన్ని అణ చుకొని, సర్వస్వాతంత్రదీక్షతో, తుచ్ఛమై, హేయమై, నీచమై, పాప

భూయిష్టమైన ఉద్యోగ వ్యామోహంలో పడి నశించకుండా, మన తాత తండ్రులనాటివృత్తి (Occupatiar) మనం అనుసరిస్తామో—అనాడే మనలో అహంకారం నశిస్తుంది. ఆకలిదప్పులు చల్లారతాయి. ఆశలు నెరవేరతాయి. అభిమానాలు వృద్ధిపొందుతాయి. ఆశాకిరణాలు జీవితారామంలో అంచాలు దిద్దుకుంటాయి. అనురాగవల్లరులు ఆనంద ప్రసవాలను ప్రసవిస్తాయి. అఖిలమానవ కల్యాణానికి, అనాడే ప్రకృతి తల్లి పచ్చతోరణాలను కనులపండువగా కట్టుకుంటుంది—అనాడే సకలమానవ భ్రాతృత్వం ; సర్వస్వాతంత్ర్య సేవాతంత్రం ; సద్యశస్సాధనమునకు మంత్రం ; అదీ యిదీ యేమిటి ఆనందోపాసన కదేక ద్రవ్యం ; ఐహికాముష్మిక సుఖాలకదే గంతవ్యం.

ఆహా ! అహంకారాన్ని చంపుకొని, అనురాగాన్ని పెంచుకొని, ఆనందంతో బ్రతకటానికి ఎంత చక్కనిమార్గం.

ఉద్యోగాల నిమిత్తమై నేను చదవనప్పుడు, ఉద్యోగాలకొరకు నేను 'దేహి—దేహి' అని చెయిచాచనపుడు, నిరుద్యోగబాధ నాకేమున్నది ? నిరుద్యోగ సమస్య ఆనాడే నశించింది...

ఇంక నాకు లోచితమైన వ్యవసాయాన్ని నేను చేసుకోవాలి. పశువులను మేపుకోవాలి. పుల్లలను కొట్టుకోవాలి...

అయితే నాకు భూమిలేదెలా ?

అహ్హాహా ! ఏమిటో ఈవెఱ్ఱి. మనసులో పుట్టాలేకాని మార్గం కనబడదూ ?

కవులకు భూమిసొందరు ఇవ్వరా ? నమ్మకంగాఉంటే ఊరంతా మనదే. నోరు మంచిదయితే ఊరు మంచిదికాదూ ? బాగుంది...చాలా బాగుంది...ఏదైనా కొద్దిభూమి అమరకానికి తీసుకుంటాను. సేద్యంచేస్తాను. తాతతండ్రులు కష్టపడి, చెమటూడ్చి గడించిన యావదాస్తి

ఏవినయకుమారుడు విద్యావేదికపైన బలిచేశాడో, ఆవినయకుమారుడే ఆవిద్యాఫలితమైన విజ్ఞానంచేత కన్నులు తెరచి, కష్టపడి, వెచ్చించిన యావదాస్తిగడించి, తనవంటి దరిద్రనిరుద్యోగ బానిసలకు మార్గదర్శికు డౌతాడు...

శభాష్ బాగుంది...కాలం కర్మం కలసివచ్చాయి కాబట్టేనా కన్నులు తెరువబడ్డాయి...

"ఇంక ప్రపంచం తల్లక్రిందులైనా నావృత్తి చేస్తాను. సోదరా! చంద్రం! మంచిమార్గం చూపెట్టావురా నాయనా! ధన్యుడను...ధన్యుడను..."

అనుకుంటూఉంటె కుమార్ కన్నులలో శాంతిదేవత నివాసం ఏర్పరచుకొంది అతని కనులలో అలముకొన్న ఆనందాశ్రువులు అమృత బిందువుల్లా చెక్కుటద్దాలమీదనుంచీ జాలువారాయి...

ఉత్సాహంతో—ఉడుకురక్తంతో ఉద్రేకంతో—ఇంటికి బయలుదేరాడు...

ఏమిటో ఆ ఆనందం?

ఏమిటో ఆవింతభావాలు?

ఎంతవరకు ఆచరణలోకి వస్తాయో? చూద్దాం...

* * * *

౪

నిరుపమదేవి—నిరుపమశోభా భాసిని—

అఖిలభువన మోహిని—

నవయౌవన విలాసిని—

లలితకల్లోలాసిని—

భావబంధుర వికాసిని—

మ త్తమదేభ యామిని—

మనసిజ మనోన్మాదిని—

మధుర మంజుల భాషిణి—

అంతేకాదు—అభిమాని—ఆర్ద్రహృదయిని — రసావిర్భూత తరంగిణి—నవనాగరికతాభిలాషిణి...

చాలదా ! ఆమె అనురూప సౌందర్యమునకు—అనుకూల కళాభిమానము...?

తావిలేని పూవువోలె, అనుకూలపతి లభించని ఆమె జీవితము, అడవిపూలతో వియ్యమందు వెలది వెన్నెలై పోయింది. మకరందములేని పుష్పపాత్రవలె, ఆనందంలేని ఆమె జీవితం, తెగిపోయిన లతకూనవలె సొగసువాడి సోలిపోయింది. దినదినము క్షీణించు క్షీణచంద్రునివలె ఆమె యౌవనసౌందర్యం క్షీణించిపోతూఉంది. ఏమి ఆమె దురదృష్టము ? ఏమి ఆమె అభాగ్యజీవితము ?

యమ్. ఎ. ప్యాసయ్యాడుకదా—యౌవన సౌందర్యాన్ని ఆదరించడా ? ఆనందవృష్టి కురిపించడా ? అనే ఆశతో హృదయ సింహాసనంమీదకు ఆహ్వానంచేసింది—ప్రేమపూలతో పూజచేసింది—కన్నీటిముత్యాలతో దండలల్లింది—ప్రయోజన మేముంది ?

పరవశంతో పాడింది ;

అభిమానంతో ఆడింది ;

పాడేపాటకు, ఆడేఆటకు, పరవశంపొందే రసికుడుకాడు. మనస్విని తో మనసిచ్చి మాటాడే మధుర స్వభావం అతని కెక్కడిది? వ్రతఛాందసుడు—

" అతనినెలాగైనా కలకత్తా తీసుకువెళ్ళాలి, కళాశాలలో 'లెక్చ రరు' గా ప్రవేశపెట్టాలి. సూటూ, బూటూ వేసుకొని, హేటు చేత్తో పట్టుకొని—'హలో ! దేవీ ! గోయింగ్' (Halo! Devi ! Going) అంటూ నన్ను చూచి వయ్యారం ఒలికిస్తూ, అందాలు చిలికిస్తూ, చిరు నవ్వు తొలికిస్తూ, 'టిప్—టాప్' గా 'కాలేజీ' కి వెళ్లే మావిభయుని జన్మలో ఒకసారైనా చూడాలి...జీవితంలో ఒకసారైనా 'లెక్చరరు' గారి భార్యా ననిపించుకోవాలి...ఒకసారైనా జీవితంలో తేజోస్వరూప మైన మెరుపు మెరవాలి...హాయిని కూర్చాలి...నూరు సంవత్సరాలు నిరర్థకమైన బ్రతుకు బ్రతికే వ్యర్థజీవికంటే—వెన్నెలలో వికసించి, కన్నెత్తి నాలుగుమూలలూ కలయజూచి, కన్నెనవ్వునవ్వి, కాలగర్భంలో కలసి పోయే మాలతీపుష్పం వేయిమడుగుల ధన్యజీవి...

ఈపర్యాయం వినయు నెలాగైనా మెప్పించి, నామాట ఒప్పిం చుకోవాలి. పరిణయమందిరంలో జయజయ ధ్వనులతో శంఖం పూరిం చాలి... "

అనుకుంటూ అప్సరోంగనలా తయారయి, భర్త దర్శనాభిలా షిణియై, గుమ్మంవద్ద నిలబడి ఎదురుత్రోవలు చూస్తూఉంది పాపం !

ఆమె ఎంత ఆనందంలో ఉన్నదో—అతడంత ఆనందంలో వస్తూ ఉన్నాడు.

ఇద్దరి ఆనందం ఒకటే—భావాలువేరు.

ఆమెదృష్టి—ఆముష్మికముపై వు.

ఆతనిదృష్టి—ఆధ్యాత్మికముపై వు.

ఆమెదృష్టి—భూమిమీద.

ఆతనిదృష్టి—ఆకాశంమీద.

భూమ్యాకాశాలెలా కలియవో, వారి హృదయాలూ అలాగే కలియవు. రోజులుగడుస్తున్న కొలదీ కర్మదేవత తన రెండు చేతులతో రెండు అశాంతాలకు వారిద్దరినీ విసిరివేస్తూఉంది...భార్యాభర్తల భావాలొకటికాని నాడు వారు పడేబాధ ఆభగవంతునకు కూడా తెలీదు—నరకంలో కూడా అంత బాధ పడరు—ఎన్ని జన్మల పాపం చేసుకుంటేనోగాని, అటువంటివారు భార్యాభర్తలు కారు.

* * * *

వినయకుమార్ గొడ్డలి నూవుకుంటూ, నవ్వుకుంటూ, ఆనందంలో వస్తూఉన్నాడు.

ఆపిచ్చి ఆనందాన్ని చూచి ఆమె నిలువు నిలువునా కూలిపోయింది. అతని మెదడు పూర్తిగా పాడైపోయిందనుకుంది. పిచ్చి ఆసుపత్రే అతనికి శరణ్యం అనుకుంది...

అతడామెవద్ద నిలబడ్డాడు...

ఆమెకళ్ళు ఎఱ్ఱజేసిచూచింది...

"ఏం దేవీ! అలాచూస్తున్నావు?"

"ఏమిటీ ఆకారం?"

"ఏం? నా ఆకారానికేం?"

"ఆచేతులో గొడ్డలేమిటి? ఆచిరిగిన బట్టలేమిటి? ఆముఖం మీాద చెమటలేమిటి? ఆనవ్వేమిటి? ఆవైఖరీఏమిటి? ఏమన్నా మతిపోయిందా? పిచ్చెక్కిందా?"

"దేవీ! నామతేమీా పోలేదు—చక్కగా—శాంతంగా—ఆనందంగా ఉంది..."

"ఆనందమా? అవును. పిచ్చివానికి తన పిచ్చిలోనే ఆనందం ఉంటుంది...సమర్థత లేనివాడు, శాంతంగా ఉంటాడు."

" ఒప్పుకొంటాను. సమర్థుడూ శాంతంగానే ఉంటాడు ; అసమర్థుడూ శాంతంగానే ఉంటాడు. కాని, అటూ ఇటూ కాని వాడే అశాంతికి పాత్రుడౌతాడు. "

" కూడూగుడ్డా పెట్టేది ఈవేదాంతమే ! "

" అవునుదేవీ ! ఈవేదాంతంవల్లే, నాఆత్మకు శక్తికలిగింది. రేపటినుంచీ కూడుగుడ్డల సంపాదించుకోగల ననేశక్తి కలిగింది..."

" ఎలా..."

" ఇదిగో...దీనివల్ల. "

అని గొడ్డలి పైకెత్తి, నవ్వుతూ గొడ్డలివంక చూచాడు.

" అం...ఏమిటి ? "

ఆమె నిర్ఘాంతపోయింది. నిర్విణ్ణ అయింది. కనులలో వెలుగు, తొలిగినట్లయింది...

" ఏం దేవీ ! అలా ఆశ్చర్యపోతున్నావే ! "

"... ..."

" దీనిలో ఆశ్చర్యానికేముంది ? "

" వినయా ! "

అనే పెద్దకేక అతనిహృదయాన్ని బద్దలుచేసింది...

" వి...న...యా ! "

" దే...వీ..."

" నీవు...అబ్బా...! "

" ఏం...ఏమిటి ? "

" పుల్లలు...చీ. చీ..."

అంటూ అతని హృదయంమీద వాలిపోయింది.

ఆమె నలాగే లోపలకు తీసుకువెళ్లాడు. మంచంమీద కూర్చో పెట్టాడు...ఆమె తలపట్టుకొని అలాగే కూలబడిపోయింది. అయిదు నిముషాలవరకు మాటాడలేకపోయింది. ఆమె కనుగొలంకులనుండి జారిన అశ్రుబిందువులు, ముక్కు చివరనుంచి, జారి నేలమీద రాలిపో తున్నాయి...

కన్నులజారి నేలమీదరాలే కన్నీరతడు స్పష్టంగా చూచాడు. అతని హృదయం జలదరించిపోయింది.

“దేవీ! ఎందుకీ కన్నీళ్లు? నీకు కష్టంకలిగించే పనేమీ చేయలేదే?”

“వినయూ!”

ఆమె ముఖం పైకెత్తి చూచింది. నీరునిండిన కనులను పయిటచెం గుతో తుడుచుకుంది.

“వినయూ! ఇంతకంటే కష్టమేమి కలిగించాలి! తినటానికి కడు పునిండా తిండిలేక, కలోగంజో తాగి కాలంగడిపే కూలీలుచేసే నీచపు పని నీవుచేస్తావా?”

“ఒకనికి చేయిసాచి, మానాభిమానాలు చంపుకొని, బానిసయై పంచపరమాన్నాలూ భక్షిస్తూ, బంగారపు ఉయ్యాలలో ఊగేదాని కంటే—కష్టపడి కలోగంజో తాగే స్వతంత్రజీవితం కలకాలం శాంతి నిస్తుంది. ఆనందాన్ని కూరుస్తుంది...బానిసజీవితం కంటే తుచ్ఛమైన జీవితం ఏముంది దేవీ!”

దేవీ! ఒక్కటి చెబుతానువిను. మానవుడుచేసే వృత్తివలన, అతని మంచిచెడ్డలు నిర్ణయింపబడవు. మమతలుడిగిన అతని నిర్మల మన స్సుయొక్క పరిణామాన్నిబట్టి అతని మంచిచెడ్డ లేర్పడతాయి...

అయినా మానవుని హృదయాన్నిపట్టి చూపెట్టగల దిట్టయెవడు? ఎవని మంచిచెడ్డ లెవరు నిర్ణయించగలరు ?

పై పూతకు భ్రమసేలోకానికి విచక్షణాసామర్ధ్యంకూడా ఉందా?"

"లేదు...విచక్షణ సామర్ధ్యలేదు...ఉంటే వేలకువేలు వెచ్చించి యమె. ఏ లు ప్యాసయిన వారంతా నీలాగ, కట్టెలు కొట్టుకొని జీవించేవారు కాని, ఉద్యోగాలు చేసుకొని భార్యాబిడ్డలను పోషించుకుంటారా ? వాళ్ళు వెఱ్ఱిగాని నీవద్ద కొంతకాలం శిష్యత్వంచేస్తే, వాళ్ళజన్మ తరించిపోదూ !

ఏమంటావ్ వినయా !"

"నీవు చెప్పింది పూర్తిగా నిజమంటాను."

"అనవుమరి"

"దేవీ ! నిజంగా వాళ్ళందరకూ జన్మరాహిత్యమే రావాలంటే స్వతంత్ర జీవితాన్ని అభిలషించాలి—బానిస జీవితానికి సిగ్గుపడాలి."

"వినయా ! ఇది కేవలం సామాన్యుల ననవలసిన మాటలుగాని నీవనవలసిన మాటలుకావు. న్యాయతా ప్రపంచంలో ప్రతిప్రాణి బానిసే...ఈశరీరంలో బంధింపబడిన జీవికి—ఖయిదులో బంధింపబడిన బంధీకి భేదమేముంది ?

( Man is born free-but fettered in cbhains )

మానవుడు స్వేచ్ఛగా పుట్టాడు—కాని ఇనుపసంకెళ్ళతో బంధింపబడ్డాడు"

అనేమాట మరచిపోయావా ? నీబుద్ధిచెప్పినట్లు—నీఇంద్రియాలు ఆచరిస్తున్నయ్యంటే—దానికవి బానిసలే...నీ అంతరాత్మ ప్రకారం నీవు నడుస్తున్నావంటే—దానికి నీవు బానిసవే...బలవత్తరమైన కర్మ

దేవత నడిపించినట్లు నీవు నడుస్తున్నావంటే—దానికి నీవు బానిసవే... ఈయింట్లో తలదాచుకొని, ఈయింటిమీద ఆధారపడ్డావంటే—దీనికి నీవు బానిసవే...

వింటున్నావా వినయా! వింటున్నావా!

ఈప్రపంచంలో బానిసకాని ప్రాణిఏది?

జనన మరణాలకు లొంగిపోయామంటే వాటికి మనం బానిసలం కాము? ఏం వినయా?"

"దేవీ! నీవు మాటలాడు బానిసత్వంవేరు—నేను మాటలాడు బానిసత్వంవేరు."

"అలాగే నీకు నిర్ణయింపబడిన పనివేరు—కూలీలకు నిర్ణయింప బడిన పనివేరు. వారు సామాన్యులు...నీ...వు..."

"నేనూ సామాన్యుడనే దేవీ!"

"ఓహోహో! తన్ను తాను తక్కువ చేసుకుంటేనేగాని గర్వం లేదనుకోరుగాబోలు!"

"ఒకరునన్ను మంచివాడనుకుంటారనిగాని, చెడ్డవాడనుకుంటా రనిగాని, ఏపనీ చేయలేదు. ఇంకముందు చేయబోను."

"చాల్లేగాని వినయా! నీ వినయానికి సంతోషించాంగాని ఊరుకో...విద్యార్థికుడవైనందుకు నలుగురకు మార్గదర్శకుడవు కావాలి కాని—నలుగురు మార్గాన్ని నీవు అనుసరించరాదు. సామాన్యులకు నీవు ఉపదేశకుడవు కావాలికాని—సామాన్యులు నీకు ఉపదేశకులు కారాదు. అలా కానినాడు తలక్రిందపెట్టి నడిచినట్లే...ప్రతిభావ్యుత్పత్తులను నీవంటి వారు ప్రదర్శించాలి.

వినయా! నాప్రార్థన అంగీకరించి, ఆగొడ్డలి అవల పారవేయి. కలకత్తా వెళదాం. కళాశాలలో ఏ 'లెక్చరు' పనో చేయుదువుగాని...

ఆనంద వాహినిల పైన జీవితనావకు, తెరచాపఎత్తి, వాయువేగాన్ని పోనిద్దాం...లే...వినయా! లే...అర్ధాంగినగు నాకామాత్రం చెప్పటానికి స్వతంత్రంలేదా? నాప్రార్థన అంగీకరించటం నీకు ధర్మంకాదా?"

అంటూ ఆమె అతని చేయిపట్టుకొని ఎంతో వినయంగా బ్రతిమలాడింది. కాని అతడు చలించలేదు. చిరుతగాలికి చెలించని మహా పర్వతంలాగ నిశ్చలుడై యున్నాడు.

"వినయా! నామాట వినవా?"

"వినలేనందుకు విచారిస్తున్నాను దేవీ"

"అయితే రేపటినుంచి కట్టెలమ్ముకొని జీవించాలా?"

"అవును."

"వినయా! దేవి బ్రతికిఉండగా నీచే అటువంటి కూలిపని చేయిస్తుందనుకోక. ఇవిగో నానగలు అమ్మివేసేయి...ఆడబ్బుతో కొంత కాలం గడుపుదాం...తరువాత మానాన్నగారి వద్దనుంచి కావలసినంత డబ్బుతెస్తాను. యావజ్జీవం ఆనందంగా గడుపుదాం.

వినయా! దేవిభర్త "కూలీ" అంటే దేవి సహించి బ్రతుకగలదా? మానాన్నగారు తలెత్తుకొని తిరుగగలదా? మీఅమ్మగారు ఈవార్త వినికూడా బ్రతికి ఉంటారనుకుంటావా? బ్రతుకు తెరువు లేని వారికిది మార్గం కావచ్చును. కాని మనకు కాదు...

వినయా! నీకు వేయివేల నమస్కారాలు. ఏపనీ చేయవద్దు. ఇలాగే ఉండు. చాలు. నిన్ను చూచుకొనే మేము ఆనందంగా కాలం గడుపుతాము...పరువులేని బ్రతుకు బ్రతికే దానికంటే చస్తే మేలు కదు వినయా!"

"అవును. అందుకనే నీనగలు—నీఆస్తి, నాకువద్దు. దేవీ!

భార్యా ఆస్తిపైనే బ్రతికేఅంత అవస్థనాకు రాలేదు. నారెక్కలు చల్లగా ఉండేవరకూ నేనొకరి ఆస్తిమీద ఆధారపడను. తరువాత భగవత్కృప."

"నామాట వినవా ?"

"వినను. వినలేను."

"వినలేవా...మంచిది...అయితే ఈదేవి ఈప్రపంచంలో జీవచ్ఛవంలాగ బ్రతికి ఉంటుందనుకోక. మన ఋణానుబంధం నేటితో తీరిపోయింది. శలవు."

అంటూ పగపట్టిన తాచులాగ వీధిలోకి బయలుదేరింది.

"దేవీ !"

అన్నాడు కూర్చున్నవాడు లేచి.

ఆమె మాట్లాడలేదు.

గుమ్మం దాటబోయింది.

అంతలో దేవితండ్రి ప్రసాదరావుగారు చూడటానికి వచ్చారు.

"ఏం? దేవీ ! ఎక్కడకు ?"

ఆమె నిర్ఘాంతపోయింది. ఏమి మాట్లాడాలో అర్థంకాలేదు. గొంతుక తడబడింది...

"ఎక్కడకూలేదు నాన్నా !"

"నమస్కారం అండీ మామగారు ! లోపలకురండి !"

"మంచిది. నాయనా ! బాగున్నారా !"

"తమరి దయవల్ల..."

"నాన్నా ! ఇలా చీకటిలో వచ్చావే !"

"ఏమీలేదు తల్లీ ! అల్లునకు చేతివాచీకి (wrist watch) బంగారపు గొలుసుచేయించి తీసుకువచ్చాను...వినయా ! ఇదిగో ! ఏం అలా ఉన్నావు..."

"ఏమీలేదండీ...ఈబహుమతులన్నీ ఎందుకండీ!"

"నాకుమాత్రం ఎవరున్నారు నాయనా! అల్లుడవైనా నీవే—కొడుకువైనా నీవే"

"ఇలాగియి నాయనా...కోటుతీయి..."

వాళ్ళుముగ్గురు ఒకరిముఖాలొకరు వింతగా చూచుకున్నారు.

భార్యాభర్తల భావాలు గ్రహించలేపోయాడాయన. ఇరువురి హృదయవేదనలు అణచుకొని, ఆయనకు చక్కని సత్కారం చేశారు. ఊరిలో ఇల్లవటంవల్ల అతడు వెళ్ళిపోయాడు...ఆరాత్రి గడిచింది...

వారిహృదయాలు ఊహించండి? ఊహాకందుతేనే...

* * * *

ఉదయం నాలుగు గంటలకు వినయకుమార్ లేచాడు, తల్లిదండ్రులకు మనసా నమస్కారంచేశాడు. తేజోమూర్తియగు భగవానుని శాంతికై ప్రార్థించాడు...లేచి కాలకృత్యాలు నిర్వర్తించుకొన్నాడు...

దేవి ఆరాత్రంతా "వినయా...గొడ్డలి...అబ్బా! వద్దు..." అంటూ కలవరింతలలో కన్నుమూయటం అతనికి తెలుసును. అతని హృదయం తెలుసుకోలేకుండా, ఆమె పడేబాధ అతడు గ్రహించాడు. జాలి పొందాడు. నిట్టూర్పు పుచ్చాడు...కాని ఏమిచెయ్యగలడు? అంతరాత్మకు వ్యతిరేకంగా వెళ్ళలేపోయాడు...

గొడ్డలి చేత్తో పుచ్చుకొన్నాడు.

"పాపం! దేవి నిదురపోతుంది. ఆమె హృదయానికి శాంతి ఎప్పుడో!...నేను చెప్పకుండా వెళ్ళిపోతే ఏమైనా అన్యథా తలుస్తుందేమో! కాబట్టి చెప్పివెళతాను."

అనుకొని దేవిదగ్గరగా కూర్చుని

" దేవీ! దేవీ!"

అని ఎంతో ఆప్యాయంగా పిలిచాడు...

" కుమార్! ఎంతకాలానికి అభిమానంతో—అనురాగంతో—అమృతం ఒలికేటట్టు పిలిచావు...ఇలారా! వినయా!"

అంటూ ఆనందపరవశయై అతని రెండు చేతులు కన్నుల కద్దుకొంది...అతడా చేతులతోటే ఆమెతల నిమురుతూ,

" దేవీ! నేను నీకెంతకష్టం కలిగిస్తున్నానన్నాడు."

" దానికేమిలే వినయా! కష్టంకలిగించినా, సుఖంకలిగించినా, నీవే కలిగించాలి కాని ఇంకెవరు కలిగిస్తారు. నాబ్రతుకు నీఅరచేతులో పెట్టాను. దానిని లాలిస్తావో! కాలిక్రిందవేసి నలిపివేస్తావో! నీయిష్టం."

"దేవీ! నీహృదయం తలుచుకుంటే నాకడుపు తరుక్కుపోతుంది"

" అలాగే నీవింతభాధాలు పడుతూఉంటే, నాకడుపు చెరువైపోతూఉంది...వినయా...ప్రియతమా!"

" ఏందేవీ!"

" నామాటవినవూ?"

"... ..."

" కలకత్తా రావూ!"

"... ..."

" ఉద్యోగం చేయవూ?"

"... ..."

"పోనీ వినయా! కూలీపని మానేయవు. గొడ్డలి పారేయవూ?"

"దేవీ! క్షమించు. నాఅంతరాత్మకు నేను వ్యతిరేకంగా నడవలేను. వెళ్ళివస్తాను."

"ఎక్కడకు."

"నిన్ను చెప్పినచోటికి"

అంటూ గొడ్డలి చేత్తోపట్టుకులేచాడు. ఆమె హృదయంమీద నుంచి మృత్యుదేవత నడచి వెళ్ళిపోతున్నట్లుంది. దానితో ఆమె హృదయం బరువెక్కిపోయింది...

"వినయూ! నామాటవినవ్వూ!"

అతడు వినిపించుకోకుండా వెళ్ళిపోతున్నాడు...

"నేను నాశనమవటమేనా నీకు కావలసింది."

అతడు మాటాడలేదు.

"వినయూ? వి...న...యూ!"

అతడు గుమ్మందాటి పోయాడు.

బయటకు వెళ్ళిపోయాడు.

అతని నలాగే శూన్యదృష్టులతో చూస్తూ, ఎత్తినతల, తలగడపై పడిపోయింది...ఆమె తలగడ కన్నీరుతో తడచిపోయింది...

ఏమిటో పాపం! అవ్యక్త హృదయిని...

* * * *

అతడిప్పుడొక కూలీ...

కష్టపడి, చెమటూడ్చి జీవించే సామాన్యజీవి.

ఆత్మావలోకనంచే అహంకారం విడిచిన—జ్ఞాని.

విద్యాభ్యాసంచే వివేకం సంపాదించిన—విజ్ఞాని.

ప్రపంచ పరిణామంగ్రహించి, మమతలుడిగిన—యోగి.

శాంత్యహింసల నాచరించి, ఫలాపేక్ష విడిచిన—కర్మయోగి.

అటువంటిజ్ఞాని—విజ్ఞాని; యోగి—కర్మయోగి; అయిన వినయుకు మార్ హృదయం తెలుసుకోలేని వెఱ్ఱిలోకం వివిధమార్గాల తలుస్తుంది. దూషణ భూషణాల కతీతుడైన అతనికి ప్రపంచం లెక్కేముంది...?

అతడిప్పుడు అడివిలో నిలబడి, గొడ్డలిప్పై కర్రి కొమ్మలు కొడుతూఉన్నాడు. తోటివారంతా ఎంతో జాలిపొందారు. ఆపనినుంచి విరమించుకోమన్నారు అతనికది యోగ్యత కాదన్నారు. అతడు వింటాడా?

ఆపనిలో నతడనుభవించిన ఆనందం వర్ణించటానికి వీలులేదు.

ఏమిటావింత ప్రవృత్తి ?

నిరుద్యోగ సమస్యను సాధించే మార్గమాఅది...?

*          *          *          *

మట్టమధ్యాహ్నం మార్తాండుడు 'నడినెత్తి' మీదకు వచ్చాడు.

పక్షులు ఆకలి దప్పులకు అల్లాడిపోతూ ఉన్నాయి.

పశువులు చెట్లనీడలలో నిలుస్తున్నాయి.

వినయునకు తప్ప తోటి కూలీలంతరకు భోజనాలు వచ్చాయి. దేనికి కోపంవచ్చి తనకు భోజనం పంపించలే దనుకున్నాడు.

"అయినా ఎవరున్నారు ? ఆమె . తీసుకువస్తుందా ? ఎంత మాట ?... ఆమె తప్పేమీలేదు. అయినా భోజనానికి ఆతృతాఎందుకు? పశుపక్ష్యాదులకు ఆహారమిచ్చే ప్రకృతితల్లి నాకుమాత్రం కమ్మని ఆహారం వడ్డించదూ ! పంక్తిలో ఒకరికిపెట్టి మరొకరికి పెట్టకుండా ఉంటుందా?

ఇన్ని చెట్లున్నాయి. నాకాస్త కడుపునిండటానికి, కమ్మని ఫలాలు నాలుగు దొరకవూ ? ఇన్ని చెరువులుండే దప్పితీర్చటానికి తీయనినీరు కాస్త దొరకదూ ! అహ్హహ్హా !"

అనుకుంటూ గొడ్డల భుజంమీద వేసుకొని అడవిలోకి వెళ్ళి ఏవో కొన్ని కళ్ళు తిని, నీళ్ళు తాగి, ఒక మఱ్ఱిచెట్టుక్రింద కాసేపు విశ్రాంతి తీసుకున్నాడు.

"ఆహా! ఎంత ఆనందంగా ఉందీజీవితం! ఎంత ఆరోగ్యప్రద మైన దీవృత్తి. పనిపాటలకొరకు చింతా చివుకూ లేకుండా, గుండెమీద చెయివేసుకొని నిదురపోవచ్చును.

అనుకొనిలేచి మళ్ళీ పుల్లలుకొట్టుకుంటానికి ప్రారంభించాడు. అతనిహృదయం తెలియక పనివాళ్ళంతా పిచ్చివాడనుకున్నారు. అత నితో మాట్లాడటానికే జంకారు...

అతని పనిలో అతడు మగ్నమైపోయాడు,

మధ్యాహ్నంసూర్యుడూ—కరిగిపోయాడు.

సాయంకాలం—చల్లగాలులతో వచ్చింది.

చెమటపట్టిన అతని శరీరాన్ని—శీతల వాయువులు సేద తీరు స్తున్నాయి.

టెక్కుతో టెక్కను కలించి తుమ్మెద దిమ్మరీడులు;

ముక్కుకు ముక్కును జోడించి విహంగ దంపతులు;

అతని దృష్టినాకర్షించాయి.

వినీలాకాశంమీదకు ఎగబ్రాకు నీలిమేఘాలు—

నీలిమేఘాలను త్రోసుకువచ్చు సంధ్యారుణ కాంతులు—

అతని మనసునకు శాంతిని కూర్చాయి...

ప్రకృతిలోని సొబగు కనులపండువగా చూచుకొన్నాడు.

ఆనందంచే అతని ప్రతిఅవయవము పరవశం పొందింది.

ఆపరవశంలో పాటప్రారంభించాడు.

గీతం :—

మాయలో పుట్టాను!
మాయలో పెరిగాను,
మాయలోనే తిట్టా,
మాయమై పోతాను...

పాప కూపమునుంచి
పైకిలేచినగాని,
పరమాత్మ రూపమ్ము
పరికించగాలేము...

ఆనంద వనములో
ఆశలల్లుకుపోతే,
బ్రతుకు బరువులలోన
భగ్నమైపోతాము...

ఆపాటలో భావాన్ని వెన్నాడుతూ ప్రపంచాన్నే మరచిపోతూంది.

పాపం! దేవియింటివద్ద ఉండలేపోయింది. లేచింది లేచినట్లేఉంది. గుక్కెడునీళ్లైనా నోట్లో వేసుకున్న పాపాన్నపోలేదు...అలాగే తూలు కుంటూ పర్ణియార్తియై; శోకమూర్తియై; వినయుని కోసంవస్తూఉంది...

కొంతదూరంలో వినయుని గొంతుకు వినబడింది...కొంతసేపటికి పుల్లల్ని కొడుతున్న అతనిని స్పష్టంగాచూచింది...ఆమె కన్నులనిండిన నీరుజారకుండా ఉండలేపోయాయి...

ఆమె ఒకదానికి ఆశ్చర్యపోయింది. పెద్ద పెద్ద వారితో మెలగిన అతడు, కూలీలతో కలసి మెలసి తిరగటానికి వెనుదీయటలేదు. ఏచేతితో పుస్తకాన్ని పట్టుకొని చదువుతూ, సరస్వతీదేవి నారాధించాడో ఆచేతి

తోనే గొడ్డలను పట్టుకొని, పుల్లలను కొట్టుకుంటూ దరిద్రదేవత నారాధిస్తూ ఉన్నాడు. తన నీచవృత్తికి సిగ్గుపడటానికి బదులు, ఆనందం అనుభవిస్తూ ఉన్నాడు. ఏమిటీసృష్టి వైపరీత్యం? విరుద్ధ భావాలను సమన్వయంచేయటానికి అతని హృదయం చక్కని స్థానమై... అతనిని చూచి నిర్ఘాంతపోయింది.

"ఆహా! భగవంతుడా ఏమిటీ అన్యాయం"

అనుకుంటూ అతని ప్రక్కనే నిలబడింది.

అతడామెను చూడనేలేదు...

ఆమె హీనస్వరంతో 'కుమార్' అనిపిలిచింది.

జవాబులేదు...

నీడకదలినట్లామె దగ్గరకువెళ్ళి 'కుమార్...' అన్నది.

అతడు తలత్రిప్పి చూచాడు.

"ఓహో! దేవీ! నీవా! రా! రా!

ఇంతదూరం ఎలానడచివచ్చావు? కాళ్ళు నొప్పిపెట్టలేదు?

అయ్యయో! ...సరే...ఇలారా! దేవీ! చూచావా ఎన్ని పుల్లలుకొట్టానో..."

"చాలాపుల్లలు కొట్టావు, నీదేవిచితికి ఎన్నికావాలో అన్ని పుల్లలు కొట్టావు"

"అదేమిటిదేవీ అలాఅంటున్నావు?"

"అంతకంటే నీవుచేసే పనివల్ల ప్రయోజనమేముంది వినయా..."

"అంతేవంటావా?"

"ముమ్మాటికి...అయినా వినయా! నేను నీభార్యను. నీహృదయంమీద నాకు అధికారంఉంది"

"లేదనలేను..."

"ఉంటేప్రయోజనం ఏముంది...?

"ఏమీలేదు. నాకట్టెల వానివేషంచూచి కన్నీరు కార్చటం...
అయ్యో! ఇటువంటి దరిద్రునకు భార్యనయ్యానే అని విచారించటం..."

"ఉ—హూ..."

"అంతకంటే ఇంకేముంది?"

"వినయా! నీతండ్రి కావలసినంత ఆస్తి గడించాడు. నాతండ్రి కూడా చాలాఆస్తి గడించాడు. ఆరెండుఆస్తుల ననుభవించటానికి మనం ఇద్దరంతప్ప మరెవ్వరూలేరు. అటువంటి విషయంలో నీవు ధరిద్రుడవెలా గౌతావు వినయా!"

"దేవీ! మనశరీరంలోశక్తి ఉండగా, ఎవరోగడించిన డబ్బు మన కెందుకు?"

"పరాయివారి డబ్బు మనకు అవసరంలేదు. కాని మనతండ్రుల ఆస్తికూడా మనం అనుభవించటం తప్పేనా?"

"ఆ...తప్పే..."

"వినయా! నీభావాలనందుకొని, అర్థంచేసుకొనే శక్తినాకులేదు... దానికేమిలేకాని...నాతుది కోర్కె తీర్చవా!"

"ఏమిటది?"

"ఈకూలీపని మానివేయుటం."

"ఎన్నటికీ విడువను..."

"వినయా! ఆలోచించకుండా మాట్లాడుతున్నావు. నీకు సర్వసోదరభావం ఉండవచ్చును. ప్రపంచానంతా ఒక్క దృష్టిలో చూడవచ్చును కాని ప్రపంచం నిన్నలాగౌరవస్తుందనుకోక."

"వెర్రిదాన. ప్రపంచం మనలను గౌరవిస్తుందని, స్తుతిస్తుందని దానిని గౌరవిసామా? మన ధర్మం మనం నర్వహిస్తాము"

"వేయిచెప్పు—లక్షచెప్పు. నీకీప్రపంచంలో ఆత్మబంధువులిద్దరే... ఒకరు మీఅమ్మగారు... రెండు నీఅర్ధాంగినగు నేను."

"అవును... కావచ్చును..."

"సంశయంలేదు వినయా అటు తల్లిని—ఇటు భార్యను; కన్నీరు మున్నీరుగా ఏడుపించిన నీసంపాదన ఎవరికి ఆనందాన్ని కూరుస్తుంది వినయ్?"

"నాకూ—నాబోటి నిరుద్యోగులకు."

"వినయా! నీవింత మొహమాటలేకుండా మాట్లాడుతా వనుకో లేదు... రెండు నెలల క్రితం నన్నెంతగా ప్రేమించేవాడవో, ఆ ప్రేమంతా ఇప్పుడెక్కడకు పోయింది వినయా!"

"ఎక్కడకీ పోలేదు. పూర్వం ఎలా ప్రేమిస్తున్నానో, ఇప్పుడూ అలాగే ప్రేమిస్తున్నాను."

"అందుచేతేనా నామాట వినకపోవటం?"

"దేవీ! నాహృదయం తెలుసుకోలేక నీవు పడేబాధ తలుచు కుంటుంటే, నాకు చాలా జాలిగాఉంది. నీవు చెప్పావని, నీమాట తోసి వేయాలని, నేనీపని చేయటంలేదు దేవీ! నాకు నచ్చిందికాబట్టి చేస్తున్నాను."

"నాకు నచ్చలేదు కాబట్టి మానేయకూడదు."

"నాఅంతరాత్మకు వ్యతిరేకంగా ఎన్నడూ నడవలేను." ఆమెకు కోపం ఆగలేదు...

"అయితే వినయా! ఆఖరుసారి ప్రార్థిస్తున్నాను. నామాట వినవా!"

"క్షమించు దేవీ! వినలేను."

" అవును. వినలేవు. నామరణానంతరం మరో భార్యా చెప్పింది విందువుగానిలే..."

" అలా ఎప్పుడూ జరుగదు..."

" మంచిది...అలాగైతే శలవు...మాయింటికి వెళ్ళిపోతున్నాను"

" మంచిది...తప్పులు క్షమించు...జ్ఞాపకముంచుకో...ఇంటికి వెళ్ళి బట్టలు తీసుకువెళ్ళు..."

" కూలీభార్యకు ఈబట్టలుచాలు."

" అయితే ఇంటికిరావా ?"

" నామాట వినవా ?"

" వినలేను."

" రాలేను."

" ఇంక మరలరావా ?"

" ఇంక ఈపనిమరలమానవా ?"

" మానను."

" రాను."

" ఇంతేనా..."

" వినయా ! నీవీపని మానేవరకూ నేనురాను...నేనీ ప్రపంచంలోనుంచే తప్పిపోతాను."

" కర్మ"

" కాదు. కాదు. కాలమహిమ."

" రెండూ కలిసివస్తేనేకాని జీవితం నిర్ణయింపబడదు."

" శలవు..."

" మంచిది...నీకు భగవంతుడు శాంతినిచ్చుగాక."

ఆమె కన్నీరుతుడుచుకుంటూ తన తండ్రివద్దకు వెళ్ళిపోయింది.

ఆమె వరకైనా చూడకుండా తనపుల్లలను మోపుకట్టుకొంటు న్నాడు...

"ఏమిటోపాపం!"

అనుకొని మూట నెత్తిమీదపెట్టుకొని ఇంటికి బయలుదేరాడు.

ఆమె జీవితం భగ్నం అయిపోయింది.

ఆమె ఆశ నిరాశ అయిపోయింది...

భార్యాభర్తల భావాలు భేదంగాఉంటే కలిగేఫలితాలే ఇవి?

ఏమిటోలెండి! ఎవరి జీవితచరిత్ర క్షణంలో ఎలా మారిపో తాయో, ఎవరు చెప్పగలరు? ఏమంటారు?

*　　*　　*　　*

౬

పదిహేను రోజులు గడిచాయి.

ఆశూన్యగృహంలో వినయకుమారు డొక్కడే రూపుదాల్చిన శాంతమూర్తిలాగున్నాడు. తనవంట తానే చేసుకుంటున్నాడు...

అతన భార్యా 'దేవి' సంగతే మరల తెలియలేదు. తండ్రివద్దకు వెళ్ళిందీ—తండ్రి ఏమన్నదీ—ఇత్యాదిసంగతులులేమీ తెలియలేదు. అటు చేసుకొన్న భార్యాను సంతృప్తి పరచలేపోయాననే అనేబాధ అతనికి లేకపోలేదు.

ఇటు తల్లిహృదయానికి శాంతి కలిగించలేపోయాడు. ఆమె సంగ తులే తెలియటంలేదు. ఆమెమీద భ్రాంతిపోయింది. అమర్నాడామె నెలాగైనా చూడాలనుకున్నాడు...

తల్లికి కనబడకుండా అంతకాలండటం చాలా తప్పనుకున్నాడు...

యథాప్రకారం పనిలోకి వెళ్లాడు...

*　　*　　*　　*

ప్రభావతికి వినయకుమార్ దీనావస్థ అర్థం అయింది. అతడు కూలీగా మారిపోవటం—భార్య వెళ్ళిపోవటం—అతడే భోజనం వండుకుంటం—కాలం చాలా దుర్భంగా గడపటం—ఇవన్నీ ఆ ఊరి వారామెతో చెప్పారు.

రాయివంటి ఆమెహృదయం కరగి కన్నీరై పోయింది.

"ఛా—ఛా—నామూర్ఖం నన్నింతచేసింది—లేక లేక పుట్టిన ఒక్క కొడుకుని ఆనందంగా పెంచుకోలేపోయాను. వాడిపెళ్ళి కనుల పండువగా గాంచలేపోయాను. కొడుకూ కోడలు ఇంట్లో రతీమన్మధుల్లా తిరుగుతుంటే చూచి ఆనందించలేపోయాను...

ఇంతకూ దేనికైనా ప్రాప్తిఉండాలి—

కావలసినంత ఇల్లుంది. అనుభవించటానికి అర్హులు—కొడుకూ ఉన్నాడు; కోడలూఉంది...లాభం ఏముంది? వాళ్ళను యింట్లోకి రానీయకుండా బ్రహ్మరాక్షసిలా కూర్చున్నాను. వాళ్ళను అనుభవించ నిచ్చానా? నేను అనుభవించానా? ఇంక రమ్మంటే వస్తారా? కొడుకూ కోడలు కలకలా నవ్వుతూ తిరిగేభాగ్యం చూచుకొనే ప్రాప్తి నాకెక్కడిది...?

నన్ను తగలేసినా మిగిలేఅంత ధనం సంపాదించి వెళ్లాడు నాభర్త దానికి ఏమైనా సద్వినియోగం చేశానా? తుదకు నాకొడుకునైనా అను భవించనిచ్చానా? ఇన్ని నగలున్నయి. ఒక్క వస్తువైనా ముచ్చటగా కోడల్నిపిల్చి, మెళ్లోపెట్టిన పాపాన్నపోయానా?

అనుభవించవలసినవాళ్ళు అనుభవించకుండా నాకెందుకీ ధనధాన్యాలు? వయసుమరలిన నాకు వీటితో ప్రయోజనమేముంది? చీనిచీనాంబరాలు ధరించుకొని—మెడనిండా నగలు దిగవేసుకొని—తగుదునమ్మా అని వీధి వీధికీ బొట్టు చెప్పటానికి వెళతానా? పోయిన కన్నె

ప్రియం తిరిగి వస్తుందా ? చచ్చిన భర్త బ్రతికివస్తాడా ? పోయిన సౌందర్యం—నెరసిన వెండ్రుకలు—ముడతలువడిన చర్మం—మరల పూర్వపుస్థితి పొందుతాయా ? ఎంతవెఱ్ఱి ?

న్యాయతా వాళ్ళు నన్నేమిచేశారని వారిమీదికోపం ? ఎంతుకీ పగ ? కక్షసాధించటానికి కన్నకొడుకే కాని మరెవ్వరూ కనబడలేదా ? ఎంతఘోరం ?

తనకునచ్చిన పిల్లను చేసుకుంటం తనదితప్పా ? ఆమె ప్రేమించిన వానిని చేసుకుంటం ఆమెది తప్పా ? ప్రేమతత్వం తెలియని నాతప్పు గాని—వారి బాధ్యతలు వారికి తెలియవు ? ఎంతవని చేశాను ? ఎంత ఘోరం చేశాను ? నాది హృదయమా ? పాషాణమా ? ”

అనుకుంటూఉంటే ఆమె శరీరంమీద అగ్నివర్షం కురిసినట్లయింది...ఆమె హృదయనాళాలన్నీ ముడులు ముడులు పడ్డాయి...

అరగంట గడిచింది...

కాలం గడుస్తున్నకొలదీ ఆమెకు పుత్రివాత్సల్యం ఎక్కువైపోతూఉంది...

లేచింది...సావిట్లోకి వెళ్ళింది...

వినయకుమార్ ఎమ్. ఏ. డిగ్రీ తీసుకొన్నప్పుడు, కలకత్తాలో గౌనువేసుకొని, ఠీవిగానిలబడి చేతిలో డిగ్రీకాయితం పట్టుకొని తీయించుకొన్న ‘ఫొటో’ చూచింది.

వెళ్ళితీసుకుంది...

ఆమెహృదయం కన్నీటిలో తడిచిపోయింది...

“ వినయా ! ఎటువంటివాడవు ఎలా మారిపోయావు తండ్రీ ! పెద్దమేడలో ఉండేవాడవు—పాకలో ఎలాగుంటున్నావు బాబూ ! కలం పట్టుకొని కాయితంమీదవ్రాసే కవికుమారుడవు గొడ్డలి చేత్తోపట్టుకొని పుల్లల నెలా కొడుతున్నావు వినయా ! పంచపరమాన్నాలు

రుచి చూడకుండా ప్రక్కకుతోసే భాగ్యశాలివి—నీయంతట నీవు కానుకొన్న గంజినీళ్ళలా తాగుతున్నావురా నాయనా!

వినయా!...వినయా...!

నాయనా! నేను బ్రతికుండే నిన్ను కూలీని చేశాను. నేను జీవించే మీభార్యా భర్తలను వేరుచేశాను. నావంటి పాపాత్మురాలు—కన్నకొడుకుని అష్టకష్టాలు పాలుచేసిన అవివేకురాలు—బ్రతికి ఉన్న దంటే అర్థంలేదు—

ఛీ. ఛీ. జీవచ్ఛవంలాగ ఇలా ఎంతకాలం బ్రతకటం? కదలే పీనుగులాగ ఇలా ఎంతకాలం తిరగటం? మానాభిమానాలు లేని నేనూ ఒక స్త్రీనే? కన్నబిడ్డ కన్నీరుకార్పించిన నేనూ ఒక తల్లినే? నావంటి స్త్రీ బ్రతికి ఉన్నదంటే స్త్రీజాతి కంతకూ కళంకమే."

అనుకుంటుంటే ఆమె హృదయం బరువెక్కిపోయింది. శ్రావణాంబుదాలెన్నో ఒకదానినొకటి ఆకాశంమీద తోసుకొస్తున్నట్లు, ఆమె హృదయంలో విషాదభావ పరంపర లొకదానినొకటి తోసుకు వస్తూ ఉన్నాయి...

ఆమె అలాగే వినయుని 'ఫొటో' చూస్తూ, కార్చిన కన్నీరు—విడిచిన నిట్టూర్పులు—ఆమె హృదయానికి ఒక్కదానికి తెలుసు... కార్చేకన్నీరు కాలవాహినిలో కలిపే కాలానికి తెలుసు...

ఆమె అలాగే రాతి ప్రతిమలా అయిపోయింది.

ఆమె చలిత నయనాల్లో వెలుగు, తొలిగిపోయింది.

* * * *

కన్నుమూసి కన్ను తెరిస్తే గడచిపోయే కాలం తిరిగి గడించలేము...కాలం కాలసర్పంలాగ గడచిపోయింది...మధ్యాహ్నం సాయం కాలంలో మణిగిపోయింది...పశుపక్ష్యాదులు ఇంటిముఖం పట్టాయి...

పాపం ! కనువిప్పి చూచింది...

ప్రకృతిలో మార్పు పరికించింది...

తనలో మాత్రం మార్పు ఎందుకు రాకూడదనుకుంది—

"మార్పు రావాలి—రావాలి మార్పు—"

అనే మాటలు ఆమె పెదెములనుంచి అనుకోకుండా వెలువడ్డాయి. కొండగృహాలోనుంచి వీచిన చలిగాలికి వణికిపోయే పాంథుని లాగ—ఆమె వణికిపోయింది.

ఆమెకేదో భావంతట్టింది...

లేచింది...

ఎండిపోయిన పెదములపై నవ్వుదొంతరలు చిలుకరించాయి...

గుండెబరువు తగ్గిపోయింది...

గదిలోకివెళ్ళింది...ఇనుపపెట్టె తెరిచింది—

అబ్బా ! ఎన్నిముత్యాలు—ఎన్ని బంగారపు నాణేలు—

ఎన్నిరూపాయిలు...

ఆమె కన్నులు చెదిరిపోయాయి...

"ఎంతకాలంవరకు విలువలేకపోయాయి"

అంటూ ముత్యాలు, నాణేలు, అన్నీ రుమాలులోవేసి మూట కట్టుకుంది...వంటవానితో గారెలు చేయించింది...ఇంకేవో చేయిం చింది—

"వినయా ! ఇంకనీవు భాగ్యశాలివే...మాకోడలు ఈచంద్ర హారం—ఈగాజులు—ఇవన్నీ అలంకరించుకుంటే ఎంత అందంగా ఉంటుందో...నాయనా వస్తున్నాను..."

అనుకుంటూ చీకటిపడుతున్నా లెక్క చేయకుండా బయలుదేరింది. కన్నతల్లి హృదయం కరగకుండానే ఉండాలి. కరిగిందో—అది

ప్రళయకాల పయోధిలాగ మిన్నులు ముడుతుంది. మన్నులు మిన్ను లేకము చేస్తుంది... 'మళ్లిప్రేమ' లోతు తెలుసుకుంటానికి ఎవరితరం?

ఆమె ఒకచేతితో తినుబండారాలమూట మరొకచేతితో బంగారపు నాణేలమూట, తీసుకొని బయలుదేరింది.

త్రోవలో—

"మావినయుడెంత మారిపోయి ఉంటాడో...!

నన్ను ప్రేమతో స్వీకరిస్తాడో—లేదో...!

ఏమైనా మావినయుని చూడాలి...వినయుని చూడందే ఈ ప్రాణం విడవలేను...

ఈపాటికి అడవినుంచి వచ్చేస్తూఉంటాడు—"

అనుకుంటూ "అడవి—కూలి..." అనే పదాలు స్ఫురించే సరికి ఆమె హృదయం పిడిలిపోయింది...పాపం...ఏమిటో...!

ఆమె వినయుని యింటిసమీపంచేరింది.

మరొక రెండుఫర్లాంగులదూరం ఉంటుంది. అంతే.

త్రోవలో వారినీ వీరినీ అడుగుతూ, ఇంటిమార్గం తప్పకుండా వెళుతుంది...

లోకబాంధవుడగు సూర్యభగవానుడు, వృద్ధత్వంచే కాంతిహీనుడై, సముద్రగర్భంలో కలసిపోతూ ఉన్నాడు. కాకులు 'కావు—కావు' మంటూ తమ తమ గూళ్ళకు వెళ్ళిపోతూ ఉన్నాయి. తమ మిత్రుడు వెళ్ళిపోతున్నాడని, లోకమంతా చీకటి మయమైతే కాకులకు సృష్టి కనబడదని 'కావుము—కావుము' అని వృద్ధభాస్కరుని ప్రార్థిస్తున్నాయేమో! పాపం!

లోకంలో మిత్రబంధు సతీవియోగం ఎవరిహృదయాలకు గొడ్డలిపెట్టుకాదు ? ఎవరి కన్నులనీళ్ళు నిండవు ?

ఏది తప్పించుకున్నా చరమదశను, మరణశయ్యను, తప్పించుకో లేముకదా !

*　　　*　　　*　　　*

వినయకుమార్ కొట్టినపుల్లల నమ్మివేసుకొని, తన జీవితోపాధియైన గొడ్డలిని భుజంమీద వేసుకొని, సాయంకాలం, చీకటిలో కలసిపోతూ ఉంటే—పగలు పగలల్లా పరమ ఉత్సాహంలో ఉన్న ప్రకృతి, రాత్రియే చీకటిని తలుచుకుంటూ విచారంలో మునిగిపోతూఉంటే—అతడటు భార్యను, ఇటు తల్లిని తలచుకుంటూ, అలసిపోయిన బాటసారిలాగ కాళ్ళు ఈడ్చుకుంటూ తన ఇంటికి వస్తూఉన్నాడు.

అతని హృదయంలో ఎందుకో నాలుగు రోజులబట్టీ విషాదమేఘాలు వెల్లివిరుస్తూ ఉన్నాయి. కన్నతల్లిని—చేసుకొన్న భార్యను—చూద్దామనే కోరికలు రోజుకు రోజూ వృద్ధిపొందుతున్నాయి.

"చదువుకున్నాను కదా ! నన్ను చేసుకొని ఆనందం అనుభవించుకుందామనుకుంది దేవి. పాపం ! నావంటి అభాగ్యుని చేసుకుంటే ఆశలు నెరవేరతాయా ?

ఆమె నవనాగరికురాలు. నేను పల్లెటూరు వాడిని. ఆమె అభిరుచులువేరు. నాఅభిరుచులువేరు. మాఇరువురి అభిరుచులకూ మధ్య, ఒక పెద్ద వినీలాకాశంవుంది. అవి యెన్నడూ కలియవు...

ఏమిటో పాపం భగ్నజీవి..."

అనుకుంటూ కొంతదూరం వచ్చేసరికి ఎవరో అతనిముందు నిలబడి—

"బాబూ ! వినయా ! మరచిపోయావురా నాయినా !"

అనేమాటలు వినబడ్డాయి...

అతని హృదయం జల్లుమంది

"అమ్మా ! మరచిపోలేదు."

అంటూ తలెత్తి చూచాడు—

ముందు నిలబడిందెవరు ?

ఎవ్వరూలేరు—

అతని భ్రాంతి దేవతే ! మాతృదేవతగా నిలబడి మాట్లాడిన ట్లయింది...

పాపం ! అతని చీకటి హృదయంలో వేయివేల త్రాచుపాముల తలలపై మణులొక్క సారిగా మెరిసి నట్లయింది...అతని హృదయ పాత్రలో పాములు విషజ్వాలలు వెలికక్కు తున్నట్లున్నాయి...

తీవ్రంగా స్పందించే అతని దుర్భర హృదయ వేదనకు తాళలే పోయాడు.

తూలిపోయాడు...

"అమ్మా ! అమ్మా !

తప్పులు క్షమించు. నాకన్నులు తెరిపించు.

నేనెంతపాపిని.

తొమ్మిది మాసములు మోసింది. కన్నది. కంటికి రెప్పగా పెంచింది. పెద్దవానిని చేసింది. విద్యాబుద్ధులను కరిపింది...దానికి ఫలితం నేనేమిచేశాను ?

నాహృదయానికి ఈషత్తుకష్టం కలిగిందంటే, గడగడ లాడిపో

యేది. నేనొక్క గంటసేపు రాత్రులందు ఇంటికి రావటం ఆలశ్యంచేస్తే— అరికినలైటిచ్చి మనిషినిపంపేది—నేను భోజనం చేసేవరకు, తాను భోజనం చేసేదికాదు.

అబ్బా ! ఏమిటాప్రేమ.

తల్లికంటే ప్రేమించేవాళ్ళీ ప్రపంచకంలో ఎవరుంటారు...?

కల్ల...కల్ల...తల్లికి బిడ్డలమీదుండే ప్రేమ భగవంతునికి కూడా ఉండదు. తల్లిప్రేమ లోతు తరచనైనా తరచలేము.

అమ్మా ! ఈరాత్రే నీవద్దకు వస్తాను. నాతప్పులు క్షమించమని పాదాలపైబడి ప్రార్థిస్తాను. బిడ్డల తప్పులు క్షమించని తల్లి ఉంటుందా ? ఎన్నడూ ఉండదు.

మాఅమ్మవద్దకు నేను వెళ్ళితీరాలి. ఈరాత్రే వెళతాను... పాపం ! ఇంత కాలంనుంచి నన్ను చూడని మాఅమ్మ ఎంత కృసించిపోయి ఉంటుందో ! ”

అని అనుకుంటూ కరిగిపోయిన హృదయంతో బయలుదేరాడు...

ఇల్లు జేరాడు.

ఇంట్లో మంచంమీద కూలిపోయాడు...

“ అమ్మా...అమ్మా...”

అంటూ వెఱ్ఱివానిలాగ మంచంమీద దొర్లటం ప్రారంభించా.

రాత్రి 8 గంటలయింది.

“ అమ్మా ! అమ్మా ! ”

అనే పిలుపు అనుకోకుండానే అతని హృదయంనుంచి వెలువడిపోయింది.

" అమ్మా ! అమ్మా ! "

" వినయా ! వినయా ! తలుపు ! తలుపు ! త్వరగాతీయి. "

" ఎవరది ? "

" వినయా ! "

" అమ్మా ! నీవే వచ్చావా ? "

" అవును నాయనా ! "

" అమ్మా ! ఎంతదయ. ఎస్తున్నాను. వస్తున్నా..."

అంటూ పరుగు పరుగున గుమ్మం వద్దకు బయలుదేరి వెళ్ళాడు...

పాపం ! నిర్ఘాంతపోయి నిలబడి పోయాడు.

తలుపు అసలు వేయనేలేదు.

తలుపు తీసే ఉంది...

మరి యెవరా తలుపు కొట్టింది ?

కలా ? భ్రాంతా ? సత్యమా ?

ఏమిటో ఈప్రపంచం అంతా ఒకప్పుడు కలకింద, భ్రాంతి కింద, సత్యస్వరూపంకింద తోస్తుంది. నిజా నిజాలు తెలుసుకున్నావాళ్ళు చాలా మంది అరుదు...

*   *   *   *

వినయుడు నాలుగుమూలలా చూచాడు. ఎవ్వరూలేరు. ఇనుప ముక్కను సూదంటురాయి లాగినట్లు, తనహృదయాన్ని తల్లి లాగేస్తూ ఉంది. తన తల్లిని చూడకుండా ఒక్క క్షణంకూడా ఉండకూడ దను కున్నాడు.

తలుపువేసి బయలుదేరాడు...

పెద్దవయి, పండిపోయి, ఎండిపోయిన రావాకుల మీదనుంచీ వెళుతుంటే—అతనికాళ్ళు మోపటంచే వెలువడిన చప్పుడు, ఎందుకో అతని చెవులకు భయంకరంగా వినబడింది...

అలా తూలిపోతూ వెళుతున్నాడు...

అలా ఎంతదూరం వెళ్లాడు ?

కొద్దిదూరమే...

అంతలో ఎక్కడనుంచో బహుబాధలో ఉన్నవారి మూలుగులా వినబడింది...

'ఎవరిదా ?' అని నాలుగుమూలలా కలయజూచాడు. దగ్గరే ఉన్న మఱ్ఱిచెట్టు క్రిందనుంచి ఆమూలుగు వినబడినట్లయింది...

ఆమసక చీకటిలో మార్గం సరిగ్గా కనబడటంలేదు...

వెతుక్కుంటూ వెళ్లాడు...

అతని హృదయం జల్లుమంది.

అతని కాళ్ళకు ఎవరి శరీరమో మెత్తగా తగిలింది...

అతడాశ్చర్యపోయి చూచాడు...

ఆమె ఒక స్త్రీ...

ఎవరది ?

అతని కన్నుల నతడు నమ్మలేపోయాడు...

"ఎవరుమీరు ?"

... ...

"ఎవరుమీరు ?"

అంటూ గద్గదస్వరంతో ప్రశ్నించాడు.

ఆమె నెమ్మదిగా...

"నీవెవరవు నాయనా!"

అన్నదతి బాధతో...

ఆస్వరం అతనికి చిరపరిచితమైన స్వరమే.

అతని హృదయం ఒక్కసారిగా క్రుంగిపోయింది.

"నేను...నేనే...వి...న..."

"నా—య—నా"

"ఆ...ఆ...నీవా?"

"నా...య...నా..."

"అమ్మా!"

"బాబూ!"

"అమ్మా!"

తల్లీ కొడుకు లొక్కసారి, మనసార, కరువుతీర కౌగిలించుకు న్నారు...చిరకాల వియోగవేదనలచేత వేగిపోయిన వారి హృదయా లకు అమృతసేచనం అయింది.

అతడు వణికే పెదములతో...

"అమ్మా! ఇలా పడిపోయావేం?" అని అడిగాడు...

"నాయనా...నీకోసం వస్తూఉంటే..."

"నాకోసమా! ఎంతప్రేమతల్లీ! నేనూ నీకోసమే బయ లుదేరాను...పోనీ ఒకరి నొకరం చూడకుండా వెళ్ళిపోలేదు... ధన్యులం..."

అయితే నాకోసం వస్తూఉంటే ఏమైందమ్మా!"

"నేను ఇంటివద్ద బయలుదేరే సరికే నాకోసం బయలు దేరింది?"

"ఎవరు?"

"ఇంకెవరు? లోకబాంధవి—'మృత్యుదేవత'

"ఆ—అదేమిటమ్మా అలా అంటున్నావు."

"అదే నాయనా! ఆచల్లని తల్లే వచ్చి నాపీవుమీద ఒక్క- చరుపు చరిచింది."

"ఏమిటమ్మా! నీవుచెప్పేది నాకేమీ అర్థంకావటంలేదు."

"నాయనా! అలాచూడు...ఆపుట్ట కనబడుతుందికదూ..."

"చూసివస్తానుండమ్మా!"

"ఎందుకు నాయనా! ఎందుకు? నేను ఆహుతి అయింది చాలక నీవుకూడా ఆహుతి కావాలా?"

"ఏం—పామేమైనా...!"

"అవున్నాయనా! అవును..."

"ఆ...పాము కరిచిందా..."

"అవును...నల్లత్రాచు బుసకొట్టి కాటేసింది...ఇంక కొన్ని క్షణాలలో నాప్రాణం పోతుంది...నాయనా! వినయా! ఇలరా! తండ్రీ! ఎంతకాలానికి చూచానురా బాబూ!"

అంటూ దగ్గరగా తీసుకొని ముఖంమీద ముఖంపెట్టి—కపోలాలు కన్నీటితో తడిచేటట్లు ఏడ్చింది పాపం!

"నాయనా! ఈప్రపంచ కంలోనుంచి తరలి వెళ్ళిపోటానికి

న్నాకిప్పుడేమీ విచారంలేదు...అనుభవించ వలసినవన్నీ అనుభవించాను. చూడవలసిన నిన్ను చూచాను...అంతకంటే కావలసినదేముంది నాయినా!"

"నాగురించి ఏమీవిచారించక నాయినా! జనన మరణాలు; సుఖదుఃఖాలు; ప్రతివారూ అనుభవించవలసిందే. ఈప్రాణి కోటిలో ఒక్కరుకూడా బ్రహ్మకల్పం వరకూ బ్రతుకబోరు...కాని నిన్ను చూడ కుండా చనిపోతానేమో అనుకొన్నప్పుడు—పడ్డాబాధ చెప్పలేను—ఇప్పుడా బాధతీరింది...

నాయినా! ఇవిగో...గారెలూ అవీ నీకోసం తెచ్చాను..."

"అమ్మా! నీహృదయం తెలుసు కోకుండా ఎంతకష్టపెట్టానో! ఇంతగా ప్రేమించిన నిన్ను, ఇంతకష్టపెట్టిన నాపాపం ఎన్నిజన్మాలకై నా పోతుందా అమ్మా!"

"అలాఅనకు నాయనా! తల్లికి పిల్లలపైన కోపమేముంటుంది? తల్లి హృదయం తెలుసుకోలేని తనయులు లెంతమందో ఉన్నారు. అంత మాత్రంలో బిడ్డలపైన తల్లికి కోపంరాదు నాయినా!

...ఏదీ...వినయా! ఇదిగో! ఈసంచితీసుకో..."

"ఏమిటమ్మాఇది?"

"మీనాన్నగారు సంపాదించిన బంగారపు వస్తువులు. నాణేలూ మొదలైనవి."

"అమ్మా! నీకంటేఎక్కువా?"

"కాదు నాయనా కాదు...ఇవి భౌతిక యాత్రకు పనికి వస్తాయి...నా...య...నా..."

ఆమె ఇంక ఎక్కువగా మాట్లాడలేపోయింది...

ఆమె తెచ్చిన వస్తువుల నన్నింటినీ ఒక మూటగట్టి—ఆమెను దానిని చేతులలో పెట్టుకొని పాపం! తన యింటికి హృదయభారంతో తీసుకువెళ్లాడు...

త్రోవలోనే ఆమెశరీరం చల్లబడిపోతూఉంది...

ఆమె కన్నెత్తి ఒక్కసారి వినయుని ముఖంచూచింది... వెంటనే ఆమెకనురెప్పలు బలవంతముగా మూతలుపడిపోయాయి. ఆమెప్రాణాలు పైకెగిరిపోయాయి. ఆమె శరీరం చల్లబడి పోయింది...

అతడింటికి జేరాడు...

ఎలాగు...

తల్లి శవంతో...

బ్రతికి ఉన్నప్పుడు తల్లి తనగుమ్మం త్రొక్కపోయినా—చనిపోయిన తరువాత కుమారుని ఇల్లు జూచినందుకు—ఇలవేల్పు నంతోషించింది...

తల్లిని మంచంమీద పరుండపెట్టి

"అమ్మా! అమా!"

అంటూ గుండె బద్దలయ్యేటట్లు ఒక్కసారి బావురుమన్నాడు. ప్రయోజనమేముంది?

చనిపోయిన తల్లి మళ్ళీ తిరిగివస్తుందా?

కాని...'తల్లిప్రేమను'

మరువగలమా?

ఎన్నటికీ—"మరువలేము"

* * * *

సుందరీ ఆనందులు వచ్చారు...

సుందరి అత్తగారి శవముమీదపడి వలవలా ఏడ్చింది...ఏడ్చి ఏడ్చి సొమ్మసిలిపోయింది—

ప్రయోజన మేముంది ?

ఇరుగు పొరుగు వారంతా వచ్చారు ?

కాని...

మన నిరుపమాదేవి గాని—ఆమె తండ్రిగారు గాని రాలేదు—

కారణం ? వారా ఊరిలో ఉంటేకదూ ! కొంతసామాను తీసుకొని ఇద్దరూ ఏనాడో కలకత్తా వెళ్ళిపోయారంట...

అటు తల్లిదండ్రులా లేరు—

ఇటు భార్యాకూడా లేదు ..

అటువంటి ఏకాకి—అభాగ్యజీవి—అయిన వినయుని గురించి ఎవరు కన్నీరు కార్చరు...

అతని విషాద జీవితాన్ని ఎవరు మరచిపోతారు ఎవ్వరూ 'మరువలేరు'

* * * *

దహనక్రియ లై పోయాయి...

కన్నతల్లి కాలగర్భంలో కలసిపోయింది.

"భ గ్న జీ వి" అయిన మన నిరుపమాదేవి తండ్రితో హృదయశాంతికోసం ఎక్కడకో వెళ్ళిపోయింది.

" అటు 'తల్లి' ఆత్మకు సంతోషం కలుగజేయలేదు—

ఇటు 'భార్య' ఆత్మకు సంతృప్తి కలుగజేయలేదు—

ఇరువురి హృదయాలను పరిదగ్ధం చేశానే—ఇరువురి జీవితాలు నావల్లనేకదా భగ్నం అయ్యాయి. ఇదేనా నావిద్యాఫలితం—"

అనుకుంటూ కుళ్ళి కుళ్ళి కృశించిపోతున్నాడు మన వినయ కుమారు...

తల్లి ఇచ్చిన యావదాస్తి మీదా ముద్దలైనవానితో సహా—ఎంతవద్దన్నా బలవంతంచేసి తన మరదలు సుందరికి ఇచ్చివేశాడు... వారానందంగానే ఉన్నారనవచ్చును. అయినా! ఏమో వారిహృదయా లెవరికి తెలుసును...మొత్తానికి వారిద్దరూ ఒకేయింట్లోనైనా కాపరం చేస్తున్నారు ఎలాగైనా వారతని ఔదార్యాన్ని మరచిపోగలరా?

ఎన్నటికీ "మరువలేరు"—

* * * *

అహో! ఈజగన్నాటకంలో ఎందరి జీవితాలు ఎంత విచిత్రంగా మారిపోతూ ఉంటాయి...

కొందరి జీవితపరిణామాలు ఊహించనైనా ఊహించలేముకదా?

* * * *

నెల్లాళ్ళు గడిచాయి...

వినయకుమారుడు యథాప్రకారం పుల్లలు కొట్టుకుంటూ ఉన్నాడు.

"త్యాగమూర్తి యగు వినయుని జీవితాన్ని తలుచుకుంటూ ముగ్ధుడైపోతున్న మన గోవిందుడు సృష్టి పరిణామాన్ని తలుచుకుంటూ పాడుకొంటూ, బండిలో వెళుతున్నాడు...

వినయకుమారుడు ఫుల్లులు కొడుతున్నాడు...

అతడు బండి తోలుకుంటున్నాడు.

ఏమి ఈసృష్టి ?

ఇరువురూ మనసా ప్రేమించిన సుందరి ఇరువురలో ఒకరికీ దక్క లేదు...ఇరువురి హృదయాలను భగ్నంచేసింది. ఇరువురూ "భగ్నజీవులే"

ఆమె మాత్రం సుఖంగా ఉందా ?

ఆమె మాత్రం ఇష్టంలేని వానిని చేసుకొని ' భ గ్న జీ వి కాలేదూ ?

పోనీ ఆమెభర్త ఆనందుడు సుఖంగాఉన్నాడా ? అతడు ప్రేమిం చిన నిరుపమదేవిని వివాహం చేసుకోలేదని అతడెన్నిసార్లు కన్నీరు కార్చాడో ఎవరూహించగలరు? అతడు మాత్రం 'భగ్నజీవి' కాడూ ?

పోనీ అతడు ప్రేమించిన నిరుపమదేవిమాత్రం సుఖంగా ఉందా ? రెంటికీచెడిన రేవడిలాగ—అటు ఆనందుని పెండ్లి యాడలేక—పెండ్లి ఆడిన వినయునితో సంసారసుఖం పొందలేక—శాంతికొరకు ఎక్కడకో వెళ్ళిపోయింది ? ఆమె బ్రతికే ఉన్నదో— చనిపోయిందో—ఎవ్వరికీ తెలీదు—ఆమె మాత్రం ' భగ్నజీవి ' కాదూ ?

పోనీ సుందరీ వినయులను వేరుచేసి, ఇన్నిజీవితాలను, తన స్వార్ధ పరత్వంచే నాశనంచేసిన, ప్రభావతి మాత్రం ఆనందం అనుభవించిదా ? ఆమె కూడా " భగ్నజీవి " అయ్యే నసించింది—

తుదకెవరానందం పొందారు ?

ఎవ్వరూలేదు—

ఇటువంటి జీవితాలెవరైనా

మరచి పోగలరా!

ఎవ్వరూ మరచిపోలేరు...

నేనూ మరచిపోలేను...

* * * *

విజయకుమారుడు వుల్లలు కొడుతూఉంటే—గోవిందుడు అతనికి వినపడేటట్లు పాట పాడుతూ బండిలో వెళ్ళిపోతున్నాడు.

ఏమని—

గీతం:—

మార్చుకోవోయ్!
మనసు
మార్చుకోవోయ్!
నీతి
నేర్చుకోవోయ్!
ఖ్యాతి
కూర్చుకోవోయ్!

మారిపోయెడి జగతి
మరచిపోవోయ్!
మరువ కున్నావో నీకు
మరణమే శరణమోయ్! మా॥
వాడిపోయిన పూవు
రాలిపోకుండునోయ్!
రాలిపోయిన జాజి

జాలి యేలోయ్‌నీకు॥ మ॥
"భగ్నజీవుల" నెవరు
"మరువలే" రోయ్!
భగ్నమైనా బ్రతుకు
కూర్చుకోవోయ్!
శాంతి
కూర్చుకోవోయ్!
ప్రేమ
నేర్చుకోవోయ్॥ మా॥

* * * *

అలా పాడుతూ వెళ్ళే గోవిందుడు ఆసంధ్యాకాలపు చీకటిలో కలసిపోయాడు...

అలా వెర్రిగా చూస్తూఉన్న వినయుని హృదయంలో మాత్రం ఆపాట నాటిపోయింది. అతని మనసునకు శాంతి చేకూరింది...

చీకటిలో వెన్నెల—
కష్టంలో సుఖం—
అనుభవించేస్థితికి వచ్చినప్పుడేకదా నిర్మలానందం.
అదేకదా బ్రహ్మానందం...
ఆహా!
ఆభగ్నజీవుల విషాదజీవితాలెవరు
మరువగలరు?

ఎవరు మరచినా నేనుమాత్రం

# "మరువలేను"

అందుకనే ఈనవల చింతపిప్పిగా వాసిశా... ఈకథంతా ఒకసారి మీరు సింహావలోకనం చేసుకొని—యదార్థభావాన్ని గ్రహించి— ఆచరణలో పెట్టండి—

అప్పుడే మీకూ నాకూ ఆనందం...!

తెలిసిందాఅండి మరీ!

ఇంకనే నుండనా?

శెలవుమరి...

నమస్కారం...

మీ చంద్రమే!

* * * *

బాలాజీప్రెస్, రాజమండ్రి.

అన్నామలై యూనివర్సిటి తెలుగు లెక్చరర్

# శ్రీ జంపన చంద్రశేఖరరావుగారి

# నవలా రాజములు.

మెరుపులా మెరసిన యిప్పటికి వెలువడిన వారినవలలే సాక్షి.

నమ్మండి—నమ్మకపోండి. నమ్మితే సుఖము—నమ్మకపోతే......

విజ్ఞానచంద్రికలు—వెదచల్లడానికి ఆనంద సౌధము—నిర్మించటానికి

వలపుపూలను—పూయించటానికి. మానవజీవితం—వర్ణించటానికి

సంఘదుర్నీతి—వ్యక్తంచేయటానికి. సంఘసౌందర్యం—సృష్టించటానికి.

సంసారమాధుర్యం-బాహ్యంచేయటానికి ఆధ్యాత్మచింతనం—అలవరచటానికి.

క్రొత్తపోకడలు—చూపించటానికి.

ఇంకా ఇంకా ఎన్నో ఆదర్శప్రాయమైన అనుభవజీవితాలను ఆంధ్రదేశానికి అందించటానికి విజ్ఞానప్రదమైన శ్రీ జంపనవారి నవలలెన్నో వెలువడుచున్నవి.

నేటివరకు ఎవరూవ్రాయని ఇంగ్లీషు, జర్మనీ, రష్యా, రొమేనియా మొదలగు సాశ్చాత్యదేశముల పేరుపొందినవారి నవలలను ఆంధ్రీకరించడం; బెంగాలీ, హిందీ నవలలను తెనిగించడం; నోబుల్ ప్రైజు విన్నర్సు (Noble Prize Winners) నవలలను మాతృభాషలో పెంపొందించడం వీరి ఆశయం. అదే వీరి అభిమానం.

చదవండి—చదివి ఆనందించండి.

## అచ్చులోనున్న నవలలు.

| | | | |
|---|---|---|---|
| 1 | కన్నీరు | 10 | పూజారి |
| 2 | కూలీ | 11 | దేవాలయం |
| 3 | ఆకలి | 12 | కులముతాలు |
| 4 | ఆశ | 13 | సతి |
| 5 | నిరాశ | 14 | పతి |
| 6 | దురాశ | 15 | సరసం |
| 7 | బలి | 16 | విరసం |
| 8 | దాసీ | 17 | ప్రెసిడెంటు |
| 9 | బానిస | 18 | వైస్ ప్రెసిడెంటు |

ఇంకను క్రొత్తరుచులను చవిచూపే ఎన్నో నవలలు వెలువడును

# యస్. అప్పలస్వామి అండ్ సన్స్,

బుక్సెల్లర్స్. రాజమండ్రి.